—: చాతుర్థికానకు :—

గుంటగలగరాకు, వెల్లుల్లి, మిరియాలు, వీనిని పండు జిల్లేడు ఆకు రసాన మర్దించి ఉశిరిక కాయంత మాత్రం మూన్నాళ్లు మింగిన చాతుర్థికం మానును.

—: ఆమశూలకు :—

కొండ పెస ఆకు. అతివస, మారేడుపండ్లు, కురువేరు, తుంగము స్తెలు, వీనిని కషాయంబెట్టి, యిచ్చినా ఆమశూల, రక్తశూల, చిరకాలం అనుసరించిన అతిసారాలు మానును.

—: అరోచకాలకు :—

జీలకఱ్ఱ, పెరుగుతోనూరి యిచ్చినయడల అరోచకం మానును.

—: అతిసారాలకు :—

కరకాయలు, వక్కలు, నూనెలో వేయించి మూడుదినాలు యిచ్చిన అతిసారాలు మానును. కడుపురోగాలుకూడా శమించును.

—: జ్వరాతి సారాలకు :—

రసం 3 వరాయెత్తు, వత్సనాభి వరాయెత్తు, మిరియాలు మాడయెత్తు, వెలిగారం వరాయెత్తు, పిప్పళ్లువరాయెత్తు, వుమ్మెత్తవిత్తులు వరాయెత్తు, అన్ని[1] గంటాకురసాన? మర్దించి గురిగింజంత వుండలుచేసి శొంఠి రసానకాని దాడిమరసానగాని పెద్దమానిచెక్క రసానగాని యిప్పించిన జ్వరాతిసారాలు మానును.

వత్సనాభి వ౩, పిప్పళ్లు వ౩,ఇంగిలీకం వ౩, ఈ మూటిని నిమ్మపండురసాన మర్దించి పెసరగింజంత వుండలుచేసి ? రిదిపంటి రసానకాని ఆరేవుప్వ రసానకాని,ఇచ్చిన జ్వరాతిసారం మానును. కొడిశపాలచక్క (పట్టవలిచి) తిప్పతీగె పర్పాటకం, తుంగము స్తెలు,

1. గలేరు ఆకు: పాన.

శొంఠి, నేలవేము, విషబొద్దివేరు వీనిని ౧ వరాయెత్తుకు (రెండువరా యెత్తు?) వంతున నలియగొట్టి కషాయంబెట్టి యిచ్చిన జ్వరాతిసారాలు మానును. కొడిశపాల, యాలకులు, అతివస, మారేడుపగడు ౧, కురు వేరు ౨, తుంగముస్తెలు ౭, మామిడిగింజలు ౪, బూరుగబంక ౫, వీనిని కషాయంబెట్టి యిచ్చిన జ్వరాతిసారం మానును. యీ కషాయంలో బూరుగబంకపోకంత, కాచుపోకంత నూరికలిపి తాగనిచ్చి 8 దినాలకు జ్వరాతిసారం మానును. తుంగముస్తలు, నేలవేము, శొంఠి, అతిమధు రం, అతివస, ఏలిచిక తిప్పతీగె ఇదివగకు ౨ వరాయెత్తు నలియగొట్టి కషాయం యిస్తే జరాతిసారం మానును.

—: రక్తాతి సారానికి :—

శ్లో. మేఘనాదస్యమూలం వా తండులోదక పేషితమ్ ।
పిబేద్వామధుసంయుక్తం హంతిరక్తాతిసారకమ్ ॥ 516

గ్రాహ్యంవటప్రరోహంతు తండులోదపేషితమ్ ।
పిబేద్వా తక్రసంయుక్తం హంతి రక్తాతి సారకమ్ ॥ 517

వోమం, బూరుగబంక, శొంఠి, దాడిమపూవు, వీనిని మెత్తగా నూరి, చల్లతోనూరికలిపి, కావలసినంత చట్టిలోబోసి, తేట, త్రాగని చ్చిన యెటువంటి అతిసారాలు మానును.

—: చాతుర్థికానకు :—

గలిజేరు వేరు, నిమ్మకాయంతముద్దను, వేడినీళ్లలో కలువుకొని త్రాగనిచ్చిన మరికొంతసేపటికి శేరెడు వేడినిళ్లతో తాగనిచ్చేది, చర్ది అవును. అప్పుడే చమటలుపట్టి జ్వరం నిలుచును. ఈ రీతిని మూడునాళ్ళు జ్వరం రాగానే యిచ్చేది. చాతుర్థికం మానును.

—: ఛర్దినిలిచేందుకు :—

వెలగవిత్తులు, మిరియాలు నూరితాగనిచ్చిన వాంతినిలుచును. బిల్వవేరు గంధంగాతీసి నిళ్లలోకలిపి తాగనిచ్చిన వాంతినిలుచును.

నువ్వులు దంచి పిడిచిననూనె త్రాగనిచ్చిన వాంతి నిలుచును. మునగ వేరుసూరి నీళ్లుకలిపి త్రాగిన వాంతినిలుచును. వేయించిననువ్వులున్ను, పేలపిండిన్ని తిన్న వాంతినిలుచును. పేలాలున్ను, వొలిచినశొంఠి, తుంగముస్తెలు, యీ మందున్ను గుడ్డనుముడిచి వుడకనిచ్చి గంజితాగిన వాంతినిలచును. ఆకషాయం గంజిలోకలిపి తాగనిచ్చిన జ్వరం వాంతి నిలుచును.

—: రక్తవాంతికి :—

మత్తిపండ్లునూరి, శర్కరగలిపి తాగనిచ్చిన రక్తవాంతిమానును. నేరేడుకొనలు, వట్టివేళ్లు, మత్తివూడలు, ఆమొగ్గలునూరి నీళ్లుపోసికాచి వడికట్టి కొంచెం తేనెపోసి త్రాగిన, కడుపులోమంట వాంతులుమానును. కర్కాటకశృంగి, పిప్పళ్లు, అతివస వీనినిచూర్ణంచేసి తేనెతోకలుపుకొని తిన్నను వాంతిమానును. వట్టివేళ్లు, శొంఠి, తక్కోలం, శ్రీగంధం, చందనం, లవంగం, పిప్పళ్లు, పిప్పలిమూలం, యాలకులు, నాగకేసరాలు, అగరు వీనిచూర్ణం సమకూర్చి సమం శర్కరకూర్చి చన్నీళ్లనుకలిపి పూటకు రెండువరాలవంతున తిన్నచో రక్తవాంతి మానును, నెయ్యి, నిమ్మపండు పులుసున్ను, కలిపి సర్వాంగంపట్టించి, శ్రీగంధంమాడయెత్తు, యేలకులు మాడయెత్తునూరి, తాగనిచ్చిన ఛర్దిమానును. సుగంధిపాల, గ్రంథితగరం, కస్తూరిపసుపు, యిదసరికూర్చి చూర్ణంచేసి రెండుకాసురలు యెత్తు వేన్నీళ్లతోతీసు కొన్న పైత్యదాహం, నెత్తురుగక్కేది నిలుచును రొమ్మునొప్పిన్ని నిలుచును. దాహజ్వరం అరోచకం నిలుచును.

—: ఆహికజ్వరాల మాత్రాలు :—

రసం వ ౧, యెలికపాషాణం వ ౨, మైలతుత్తం వ 3, గంధకం వ ౪, వీనిని వుమ్మెత్తాకురసాన తొమ్మిదిఝాములు మర్దనజేసి గుంజా మాత్రం వటకాలుజేసి దీనికి అనుపానం పాతబెల్లం, అగసీపూలు మిరియపునీళ్లలోను యిచ్చేది వొకవుండయిచ్చేది. ఇందున యేకాహిక ద్వాహిక త్ర్యాయాహిక చాతుర్థిక జ్వరాలుతీరును.

—: జ్వరాలకు మూలికా ప్రయోగాలు :—

సూర్యకాంతి వేళ్లు రెండు గొంటుపోకలంత నూరి, బెల్లంతోగాని చక్కెరతోగాని ఇచ్చేది. పురాణ జ్వరాలు మానును. వెల్లుల్లి వసగేదెమజ్జిగతో నూరి మూడు దినాలు త్రాగిన జ్వరము మానును. మంచి వావింటివేళ్లు కొంచెం పసుపు వీనిని పాలలో పోసి నూరి నిమ్మకాయంత ముద్ద నీళ్లు కలుపుకొని త్రాగిన మూడు దినాలకు జ్వరం మానును. జిల్లేడు వేరు, పండిన జిల్లేడు ఆకులు వీటి రసం త్రికటుకం ప్రతిపాకంబెట్టి నస్యం చేసిన జ్వరం మానును. నేలవేపాకు ౨ వరా యెత్తు నల్లజీలకఱ్ఱ ౨ వరా యెత్తు, పిప్పళ్లు వ. ౨ వీనిని అడ్డసరపాకు కషాయం పోసి నూరి కల్పి మూడు దినాలు త్రాగిన యెటువంటి జ్వరాలు మానును. వేడీనీళ్లతో మిరియంపొడి తాగను శీతజ్వరం మానును, నేలతంగేడు చూర్ణం చారెడు వేనీడిళ్లతో కలిపి తాగను జ్వరం మానును. కరక్కాయ గోమూత్రాన నూరి త్రాగను జ్వరం మానును. కురువేరుదుంప, కోష్టం మారెడు పండు, గజపిప్పళ్లు, జాజిపువ్వు ఇది కషాయం యిచ్చ్యాను సకల జ్వరాలు మానును. తెల్లవాకుడు వేరున్ను నేలవేమున్ను ఆదివారం నాడు రక్షగట్టుకొన్న చాతుర్థకం మానును. శీకాయగింజలు, మిరియాలు పది మెత్తగానూరి త్రాగిన చాతుర్థిక మానును. చింత చెక్కలు కాల్చిన బూడిద చారెడు ఆ బూడిదలోను నీళ్లుపోసి కరిగించి బట్టను వడికట్టుకొని ఆ కారవు నీళ్లు నాలుగు అడ్డలు అష్టభాగంగా కాచిన నీళ్లలో మిరియాలు ౨౦ శొంఠి కొమ్ములు ౪ పసుపు ౧ వీనిని నూరి 3 దినాలు ఇస్తె చాతుర్థికం మానును. దుష్టపు ఆకు, తెల్లగింటెన ఆకు వేరు వూగడు వేరు, తుత్తిరి ఆకు, ఉత్తరేణి ఆకు, చిత్తివేరు వీనిని సరిగా తూచి నూరి నీళ్లు కలిపి తాగనిచ్చిన కడుపుపారును. పాలు కలిపి తాగ నిచ్చిన జ్వరం మానును. మిరియమున్ను, వెల్లుల్లిన్ని, వెలిమిడిన్ని సరిగా కలిపితాగనిచ్చిన శోభ (తగ్గి వాపు) మానును. పథ్యం పాలు వంటకం ఇచ్చేది. వాత జ్వరానికి కర్కాటక శృంగి, పిప్పళ్లు, అతివస 3 దినములు కాగబెట్టి చూర్ణంజేసి ఇచ్చిన చాతుర్థికం మానును.

జ్వరం మానును. శ్రీగంధంవేరు, అరపొడి, శొంఠి, పర్పాటకం, తుంగ ముస్తెలు వట్టివేళ్లు వగకు వ. ౧ వంతున నలియకొట్టి నాలుగు అడ్డలు నీళ్లు పోసి అష్టభాగంగా కాచి, పిప్పలిపొడి వేసి ఇచ్చిన వాతజ్వరం మానును. కుంకుడుపండుతోలు బెల్లంతో కలిపి తాగను చాతుర్థికం మానును. రాసానపాకుసమూలం ? రసం రెండుమాగాణిలు తిప్పతీగెఆకు రసం రెండుపళ్లు, నూనె పశి ౧, ఆవుపాలు పడి ౧, నెయ్యి కొంచెము బాగుగా కాచి సర్వాంగం పట్టించేది. వాత వెట్ట మానును. త్రికటుకం జీలకఱ్ఱ చూర్ణం తేనెతో ఇయ్యను జ్వరం మానును, చింతాకునాలుగు చాటలు ఇనుము రేకులు రెండు శేరులు నీళ్లు(?) తూములు పోసి తూమెడు గాకాచి దాంట్లో త్రికటుకం జీలకఱ్ఱ పలాలు ౪ చిట్టం, గోమూత్రాన శుద్ధిచేసినది చూర్ణం ప. ౪ ఇది లేహ్య పక్వంగాదించి, తేనెపశి పోసి మర్దించి అను దినము తానికాయంత పుచ్చుకొనిన త్రిదోష జ్వరము మానును. పాండు, శోథ, విసర్పిరోగాలు, కామిల యివి మానును.

## —: బాలురకు, గర్భిణీ స్త్రీలకు జ్వరాలకు :—

ద్రాక్ష, లవంగం, ఉశిరికపప్పు, అడ్డసరం, యష్టిమధుకం కలిపి నేతితో ఇచ్చిన బాలులకు జ్వరాలు మానును. గర్భిణీ జ్వరాలకు నేలగుమ్మడి తిప్పతీగలను ౧౨ వరాల యెత్తు నలియకొట్టి కషాయముబెట్టి, పంచదారతోగాని నేతితోగాని ఇచ్చిన గర్భిణీ జ్వరాలు మానును.

## —: మేహజ్వరాలకు :—

ఏలకులు, శ్రీగంధం, అతిమధురం శొంఠి, జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ ధనియాలు వగకు రెండేసి వరాలు యెత్తు వేన్నీళ్లతో నూరి ఇచ్చిన మేహజ్వరాలు మానును.

## —: శీతజ్వరములకు :—

చిత్రమూలం వేళ్లు వ ౧, శొంఠి వ ౧, తులసి, పట్టెడు ఇందులో రెండువర్దుసేర్లుపోసి కషాయంకాచి దానిలో పిప్పలిచూర్ణం ప్రతివాసం(?)
౧౧ ౧౧

జేసిమూడుదినాలు యిచ్చిన తాపజ్వరంమానును. పథ్యం పాలువంటకం. శీతజ్వరమునకు పాలు అరతూమెడు యిందిరిశవునార ? పిడికెడువేసి నీళ్లు యిగరనిచ్చి పాలు వడియకట్టి యిచ్చిన శీ త జ్వ రం మా ను ను. మూడు దినాలుయిచ్చేది. వు త్త రే ణి ఆ కు న్ను, మూడుఉల్లిపాయలున్ను, మిరి యాలు, నిమ్మకాయంతమందు నూరి చింతగింజగుజ్జులో పొదిగించి, ఈ లాగున మూడుదినాలు ఇచ్చిన శీతజ్వరం మానును.

## —: వైశ్వానరచూర్ణం :—

త్రికటుకం, యాలకులు, యింగువ, గంటుభారంగి, బిడాలవణం, యవక్షారం, మజ్జి, బొద్దివేళ్లు, చాగదుంపలు, చవ్యం, చిత్రమూలం, గలి జేరువేరు, లవంగం, సైంధవలవణం, పిప్పలిమూలం, కొడిశపాల వీనిని చూర్ణం చేసి మాడయెత్తుయిచ్చేది నెయ్యివంటకంలో భోజనంచేసేది. ఇందున పాండు క్షయ, కాసం, వాతజ్వరం, పీనస వ్యాధులు మానును.

## —: సన్నిపాతాలకు నస్యం :—

యిప్పపిండి, పిప్పళ్లున్ను, నస్యంచేసిన సన్నిపాతం మానును. తుమ్మి తులసి, లవణం, మిరియాలు, వీనినినూరి నస్యంచేయత్రిదోషశ మనము.

## —: జ్వరదాహాలకు :—

తుంగముస్తలు, మారేడుపత్రి శ్రీగంధంపొడి, శొంఠి, పర్పాటకం వట్టివేళ్లు వగకు మాడయెత్తు నలియకొట్టి కషాయంఅష్టభాగం కాచితాగి నను జ్వరదాహాలు మానును.

## —: తాప జ్వరానికి :—

శొంఠి, తిప్పతీగ, దూలకొండి ముస్తలు, కోలపొన్న, వాకుడు,

ముయ్యాకుపొన్న, ములక, పిప్పలిమూలం మూడు వరాల యెత్తు పల్లేరు, కొడిశపాల, కటుకరోహిణి, తేనె, కరక్కాయ సమభాగం తూచి కషాయం బెట్టి ఇచ్చేది. లేదా తగుబాటు వేడినీళ్లను కలిపి ఇచ్చేది. దీని చేత జ్వరం మానును.

—: శ్లేష్మ జ్వరానికి :—

కొడిశపాల విత్తులు, పెద్దదుప్పివేరు, ఇది లేకున్న చాగవేరు, కటుకరోహిణి, గంటుభారంగి, మిరియాలు, అతివస, చవ్యం యాలకులు విష్ణుబొద్దివేరు, జీలకఱ్ఱ, పెద్దమానిపట్ట, వోషం, ఆవాలు వీనిని వగకు వ. ౧ కషాయం బెట్టి ఇచ్చినా అన్ని జ్వరాలు మానును.

—: వత్సకాది కషాయం :—

కొడిశపాలవేరు, పాపటవేరు, వస, కటుకరోహిణి, దేవదారు, పసుపు, చేదుపొట్లాకు, దూలగొండి, పర్పాటకం, వట్టివేళ్లు, అతిమధురం, కుంకుడువేరు, తిప్పతీగ, కోష్టం, వెంపయానలు, ? శ్రీగంధం, త్రికటుకం, త్రిఫల, పిల్లిపెసర, సహదేవివేరు, చాగవేరు, మారేడుకాయ అతిమధురం పిప్పలీమూలం, ముస్తలు, అడ్డసరపాకు, తామరపువ్వు, ఖర్జూరం ఇప్పపువ్వు, ద్రాక్ష, కలువదుంప, అతివస, సుగంధిపాల ఈ ముప్పైనాలుగు వగలున్ను సమంగా చూర్ణంచేసి ఆ చూర్ణ పలం ౧ వేసి రెండు శేర్ల నీళ్లుపోసి ర శేర్లు తేనెపోసి ఇచ్చిన సన్నిపాతజ్వరాలు మానును. సంతత జ్వరముకూడా మానును.

—: పెట్టుమందుకు :—

[1]యుశనీరుకాయ తెచ్చి ఒక పాత్రలోపోసి ఒక కాయ రోట్లో వేసి లొక్కిన వగరు నీళ్లు పిండిన నీళ్లు రెండుపళ్లున్న మునుపటిపాలున్ను

1. లేతకొబ్బరి నీళ్లు.

కలియపోసి ధరణమెత్తు మైలుతుత్తం, పెంకుమీద తెల్లగా కాలనిచ్చి తీసుకొని పచ్చిమైలుతుత్తం వ. ౧ నీళ్లలో కలిపి ఒక పూట 3 బొట్లు నూనె ఆ రసములో పోసి యినుమంత కాగనిచ్చి దించుకొని అప్పటికి అప్పుడు చారెడు నీళ్లు పుచ్చుకొనేది వాంతి అవును యెన్నిమాట్లు కావలెనో అన్నిమాట్లుపుచ్చుకొనేది.మందు వెళ్లిపోయిన నాడు లంఘనం.

—: ఛర్దికి :—

అల్లపురసమున్ను, మాదీఫలం, అగరున్ను, పంచదార, సైంధవ లవణం, స్వల్పంగానుకూర్చి ఇచ్చేది, మానును. లాజలున్ను, వేయించిన కందులున్ను, కషాయంబెట్టి పంచదారనుకూర్చి పచ్చకర్పూరంకూర్చి ఇచ్చేది. ఛర్దిమానును. యెజ్జమున్ను వేయించి, అందులోపల కడుగుపోసి లెస్సగా కలియబెట్టి, తేటనుగ్రహించి అందులో లాజపొడి, పంచదార కర్పూరంవేసి ఇచ్చిన మానును. పంచవల్కలాలు కషాయంబెట్టి అందులో రెండుపలాలుశొంఠిన్ని, పేలాలు రెండుపలాలు కషాయంబెట్ట తేనె కర్పూరంపాలు కూర్చియిచ్చేది. పిల్లిపెసరసమూలమున్నుదంచి తీసుకొన్న పసరున్ను, అల్లపురసమును, తేనెను, పంచదారను, కూర్చి కర్పూరం కూర్చి వచ్చిపెసరే ఇచ్చేది.

—: పాషాణదోషం :—

రెడ్డివారి నానబాలున్ను(?) చిల్లగింజలున్ను,పత్తికాయలున్ను కలబందవేళ్లున్ను, చిట్టామిదాం వేళ్లున్ను, దోసాకు తులసి ఆకు కషాయం యిచ్చిన పాషాణదోషం మానును.

—: విస్మృతికి :—

బ్రాహ్మిఆకురసం, పంచదారయిచ్చిన మానును.

—: నూతికా వాయువులు :—

జిల్లేడు వేరుపట్ట వేసేడిళ్లతో మెత్తగానూరి ఆముద్దకు సగంసున్నం

కల్పి 8 పిప్పళ్లు కూడానూరి ఆముద్ద అది నూష్మంగాను విడం వేస్తేను అక్కిళ్లు బిగియపెట్టినది మానును. రెండుపళ్లనూనెలోను వెల్లుల్లిపాయలు ప ౧, కానుగ వేరుచక్క ౪, నూరిన ముద్దలో నూనెకలిపి నూనెకు సమానం పాలుకలిపి ఆనూనెలో మిరియాలు ప ౧ పిప్పళు పం, కటుకరోహిణి పం, ఇదిపొడిగానూరి నూనెలో వేసి, వెచ్చబెట్టి కల్కంతో కూడాను కాచి బలాన్కి తగ్గట్టు పుచ్చుకొనిన నూతికా వాయువు మానును.

## —: బహుమూత్రానకు :—

వెడత్తర,? కొణుతరాకు, తంగేడుపువ్వు, నల్లపులుగుడుఆకు, వాపైపై ? ఆకు, దోసరాకు, యేనుగపల్లేరుఆకు, ఇచ్చేది.

## —: నీరుకట్టుకు :—

పటికారం వెలిగారం, అతిమధురం. చంగల్వకోష్టం, యాలకులు గోమూత్రం, శిలాజిత్తు, కర్పూరంచూర్ణం సమాంశాలు కలిలోను, ఆదొండాకు వేసికాచి వడియగట్టి, ఆచూర్ణంయిస్తే నీరుకట్టుమానును. చల్లగడ్డలు తెచ్చి పైపొట్టువొలచి దంచి రసంపిండుకొని అందులో పొంగిచి వెలిగారం కూడ యెత్తు, కర్పూరశిలాజిత్తు కూడయెత్తు, దోసవిత్తులు వ. ౧, జీలకఱ్ఱ వ. ౧ చూర్ణం ఆచల్లగడ్డలరసంతో, పుచ్చుకొనేది, బొడ్డునవెలిగార, పెట్టుప్పున్ను, మంచి వుప్పున్ను నూరి పట్టిస్తే నీరుకట్టు మానును పావురముల మలమును పొంగించి వెలిగారంపొడిని వేన్నీళ్లతో కలిపి ఇచ్చేది

## —: ప్రమేహానకు :—

రెడ్డివారి నానబాలు, అరటి దుంపలనీళ్లు నూనె విడిచి ఇచ్చేది, రేగుచిగుళ్లు, గుంటగలగర ఆకు పసదున నూరి ఆ పెరుగుతో ఇచ్చేది. ఛాలజపాకు ? ర పిప్పళ్లు ౫ మిరియాలువ. ౫ నేతితో పుచ్చుకొనేది.

—: రసవెక్కినందుకు :—

కలుబంద పలుగులున్ను,(గుజ్జు) గంధకమున్ను నూరి ఇచ్చేది. రస వేగాలు మానును.

—: శోభలు :—

దిరిశెనపుచక్క వేడినీళ్లతో పుచ్చుకొనేది. పథ్యం మేకపాలు అన్నం పుచ్చుకొనిన మానును.

—: రక్తపైత్యానకు :—

నేలతాటి గడ్డలు, ఆవుపాలతో నూరి పుచ్చుకొనేది.

—: గ్రహణికి :—

నీరు గొబ్బివిత్తులు పెరుగుతో నూరి ఇచ్చేది.

—: హిక్కకు :—

గాజుపొడి నూరినేతితో ఇచ్చేది. అపామార్గం, బియ్యం తేనెతో ఇచ్చేది.

—: కామాలకు :—

మణుగు దామెరఆకు గోమూత్రంతో నూరి ఇచ్చేది. చిల్ల గింజలనూరి కన్నులలో బెట్టేది. వెఱ్ఱిబీరకాయ పీచులో చనుబాలు పోసి పిసికి నస్యంచేసి ఆ స్వరసమున్ను వెన్నను మర్దించి కన్నుల బెట్టేది. గలిజేరు వేరున్ను, మిరియాలున్ను, వెల్లుల్లి పాయలున్ను ముద్దగానూరి వెన్నను పొదిగి యెనిమిది దినాలు పుచ్చుకున్న కామల మానును.

—: రసం దిగేందుకు :—

దోసాకుపిండి, దొండాకు, కామంచి ఆకు, పత్తి ఆకు, సహదేవి ఆకు, ముద్దగా నూరిపట్టించి, అభ్యంగమర్దనం చేసేది, లోపలకి ఆ పసరు ఇచ్చేది.

—: నొప్పుల దేహాలకు :—

పరంగిచక్క ప. ౧౦ గోధుమ చూర్ణం ప. ౫ వోమం ప. ౫ వరిబియ్యపు పిండి ప. ౫ పిప్పలి ప. ౧, మిరియాలు అరపలం మూలికా విశేషం చేతను రస భస్మం చేసి ఆ భస్మం నాలుగు వరాలయెత్తు. సమాంశాలు బెల్లంవేసి మర్దన చేసి అక్షప్రమాణం మాత్రలు చేసి పుచ్చుకొనేది.

—: ఛర్దికి :—

పేరాముట్టి ప. ౪, శొంఠి, పచ్చిబియ్యంకడుగున కషాయం పెట్టి, పాలికెడు! కషాయంలోను తేన కర్పూరం కూర్చి ఇచ్చేది. చర్ది మానును.

—: గుల్మానకు :—

ఉత్తరేణుక్షారం, అరటిబొందెక్షారం, బొంతక్షారం, జముడు క్షారం, వెంపలిక్షారం, జిల్లేడుకట్టలక్షారం, తీగజముడుకట్టక్షారం, పాతచిట్టంపొడిన్ని యీక్షారాలు అన్నిన్ని సమాంశాలుగా కూర్చుకొని వగకు పలం ౧ వంతున వేయించిన వుప్పు ప.౨, మిరియాలు ప.౧, వోమం, ౨ పలాలు, పిప్పళ్లు ప ౨, చూర్ణంచేసి సర్వంసమ్మిశ్రంచేసి 'కొంచంగా ప్రతి రోజున్ను నిమ్మకాయవులుసున పుచ్చుకుంటే గుల్మాలు మానును. ఉత్త రేణివేళ్లున్ను, ములుగోరింటివేళ్లు, ములుబూరుగవేళ్లు, చూర్ణంసమాంశం యిందుకు నాలుగుపాళ్ళు శర్కర, సగంమిరియపుపొడి, కూర్చిసమ్మిశ్రంచేసి లోహం మండూరంకూర్చి నిత్యం పుచ్చుకొనిన గుల్మాలు మానును.

—: నేత్రవ్యాధికి :—

త్రికటుకాలు, సైంధవలవణం, కాకరాకు, కుప్పింటాకు పసురున మర్దనజేసి కన్నులబెట్ట నేత్రవ్యాధిహరం ఇప్పపిండి, కరక్కాయనూరి కన్నులచుట్టు పట్టించను నేత్రవాయువులు మానును,

—: వీర్యవృద్ధికి :—

నల్లవడ్లు పడి 3, ఉప్పు పం, వెణుతురువేళ్లు, తెల్లపులుగుడువేళ్లు కీనిని వృడకకెట్టి ఆవడ్లు బియ్యం, ఆవుపాల నానబెట్టి, శర్కర నెయ్యి యాలకులు పొడివేసి రేపాడి పుచ్చుకొనేది. సాయంకాలం అశ్వ గంధచూర్ణం ఆవుపాలను వుక్కరకా వండిపెట్టుకొని పోకంత పుచ్చుకొనేది. నష్టవీర్యోత్పత్తి, బీజస్తంభన కామ్యవృద్ధులు అవును.

—: స్నానాదానకు :—

ఉత్తరేణిఆకు రసం, శర్కర, జీలకఱ్ఱ, నెయ్యిన్ని పుచ్చుకొనేది. తురకవేపాకు రసమును, నెయ్యిన్ని మిరియపుపొడిన్ని పుచ్చుకొనేది. లవంగరసం పాత్రకి లోబెట్టి నస్యంచేసేది.

—: మేహాలకు ప్రమయము :—

తంగేడుకొనలు, గోరోచనం రూకయెత్తు, పూటకు ఇచ్చేది. వెదురు ఆకుమశిన్ని, నీరుల్లి రసమున్ను, రుద్రాక్ష, చింతగింజలపొట్టున్ను నూరి యిస్తేను, కామ్యంరక్తం మంట మానను. గానుగపిండి రాత్రినాన వేసి మంచినీళ్లుపెర్గు నూనెబొట్లు 3 పుచ్చుకొనిన యోనిరక్తాలు మానును. కాకరాకురసంలో మేకపాలుపిలికిపుచ్చుకుంటే ప్రమేహాంమానును. అప్పుడే పిండిన మేకపాలు, నిమ్మపండ్లరసం యిస్తే ఆమచలనం మానును.

—: ఆసనరక్తాలు :—

అత్తికాయల కషాయం, జీలకఱ్ఱ, పంచదార కూర్చియిస్తే మానును, నూనెయును పాచినీళ్లను, కరగించి పుచ్చుకొంటే ప్రమేహం మానును. పందినెయ్యి ప్రమేహం మానును.

నల్ల వరిబియ్యమున్ను, కరివేపాకున్ను కూడాకొట్టి పిండిపెట్టుకొని నూనె పోసి పంచదారతో పుచ్చుకొనిన ప్రమేహం మానును. తెల్లవుప్పి ఆకు రసం, నీరుల్లిగడ్డల రసమున్ను వెలిగారంకొంచం పుచ్చుకుంటే నీరుకట్టు మానును. పర్పాటకం ఆవుపాలలో నూరి పంచదారవేసి పుచ్చుకుంటే,

యోనిరక్తాలు మానును. అడ్డసరపాకురసమున్ను, కాచు పిప్పళ్ళున్ను,నల్ల జీలకఱ్ఱ లక్కనుపొడి చేసి యిచ్చిన యోనిరక్తాలు మానును, దోసాకు మంచినీళ్ళలో పిసికితే గట్టిపడును. శర్కరవేసి పుచ్చుకొనిన శామ్యం మంట మానును.

—: రక్తప్రమేహము :—

నరువ్యాళి ! ఆకురసం, చల్లగడ్డలరసం, పెద్దగుమ్మిడికాయ రసం అమృతపళ్ళరసం? గడ్డలు! ఆవుపాలతోరుబ్బి, ఈస్వరసాలున్నఅన్నికూర్చి ఆవునెయ్యి ర అడ్డలు నీళ్లుపోసి ఘృతపక్వాన దించుకొని పంచదారవేసి పుచ్చుకొంటే రక్తప్రమేహ శుష్క శరీరాలవారికి మంచిది.

రక్తప్రమేహానకు, దాసానపాకు, ఆ పూలరసం పిడుచుకొని, నీరుల్లిగడ్డలరసంతోను, కూర్చి చక్కరవేసి పుచ్చికొనిన మానును. చింతగింజలపై బొఖ్ఖరతీసుకొని నిమ్మకాయంత ముద్దనూరి, జీలకఱ్ఱపొగించిన వెలిగారం, పంచదారకూర్చుకొని, ఆవునేతితోగాని పుచ్చుకొనిన, శామ్యం మంట మానును.

—: ప్రమేహానకు :—

ములుగోలిమిడి విత్తులున్ను, బూరుగ బంకను పచ్చి పాలతో నూరియిచ్చిన మానును.

—: ప్రమేహానకు :—

తంగేడు పూలు సమూలమున్న పొడిచేసి చల్లలో తాగిన మానును.

—: రక్తప్రమేహానకు :—

మామిడి చెక్కరసం కాలుశేరు, చక్కర అరపలం పెరుగుతో మూడు రోజులు ఇచ్చేది.

—: ప్రమేహానకు :—

పెట్లుప్పు ప. ౮, మిరియాలు ప. ౮, పిప్పళ్లు ప. ౮ వేడినీళ్లతో పుచ్చుకొనవలెను. పథ్యం, పులుసువాడరాదు.

—: చూతఫల చూర్ణము :—

శ్లో. చూతఫలం త్రిఫలాసమభాగం ...... చతుర్గుణయుక్తం ।
చూర్ణమిదం మధునా చ విమిశ్రం వింశతి మేహాన పోహతి సద్యః ॥

నేరేడు చిగుళ్లు జాజికాయ, జాపత్రి, నూరి తేనెతోకాని నేతితోకాని ఇచ్చేది. రక్త ప్రమేహం మానును. నల్లతుమ్మ చిగుళ్లు, జీలకఱ్ఱ ఆవుపాలతోనూరియిచ్చేది రక్తప్రమేహం మానును.

—: రక్తపైత్యానకు :—

ఆవునెయ్యి చక్కెర వేసి ఇచ్చిన రక్తపైత్యం మానును.

—: గుల్మము :—

మంచికాకి చిప్పలు తెచ్చి చింతపట్టలో పుటంవేసి వస్త్రగాళితం చేసి సముద్రలవణం, మంచిచౌటుప్పు, మిరియాలు, వెచ్చచేసి, కాచలవణం, యవక్షారం, వోమం, ఈ సరుకులుకూర్చి చూర్ణంచేసి మూడు వేళ్ళను తీసుకొనిన సకల గుల్మాలు మానును. మంచికాకి చిప్ప తెచ్చి చూర్ణంచేసి రాతిపూవు ప. ౨, సైంధవలవణం ప. ౧, ఇంగువ ప. ౧, గచ్చవిత్తులు, వోమం, యవక్షారం, చౌకారం, ఈ మూడు వగలున్న పలిమడేసి ? శొంఠి, పిప్పలి, మిరియాలు, వెలిగారం ఈమందులు అంతా వేయించి కాకి చిప్పల చూర్ణం దానికి మూడుపాళ్లు ఈ చూర్ణం వేసి రెండువరహాల యెత్తు దినమూ వేడినీళ్ల పుచ్చుకొనిన గుల్మాలుమానును.

—: కడుపులో మృతినొందిన శిశువు బైటనొందుటకు :—

అరటిబొందె పావెలాకున్ను, కషాయం ఇచ్చిన కడుపులోనిశిశువు బహిర్గతమగును.

—: సుఖప్రసూతి అగుటకు :—

నాభి, గంధకంతీసి, తొడలో రేఖగా పట్టించను త్వరగా ప్రసూతి అగును. లంజసవురం ఆకురసం తొడలపట్టించిన సుఖప్రసూతి అవును.

—: కడుపులో చచ్చినపిండం వూడిపడుటకు :—

అతిమధురం, ఆవునేతితో తాగిన కడుపులో చచ్చినపిండం బయట పడును, ములుగొంటాకు పుడకబెట్టి ఆకడుగు నూనెతో త్రాగిన మావి పడును. జనపవిత్తులునూరి తాగినమావిపడును.

—: ఛర్దికి :—

కస్తూరి బట్టనుపట్టించి ఆబట్టను ఆఘ్రాణించేసేది. కర్పూరం నోట్లోవేసుకొని ఆరోగి ముఖాననుండి శరీరమెల్ల ముమ్మారువూది తేను. చర్దిశమనం అవును. ఖర్జూరంపండు లోపలికి తినిపించేది. ద్రాక్షపండు, తేనెతోకలుపుకొని పుచ్చుకొనేది. ఛర్ధిమానును.

—: ఛర్దికి కషాయం :—

ఖర్జూరపండు, కొత్తవరిబియ్యం, అతిమధురం, మారేడువేరు, శొంఠి, యినుమంతవేసి, కషాయం తేనెతోకలిపి కర్పూరంసమ్మిశ్రం చేసి తీసుకొంటె ఛర్దిమానును.

—: నీరుకట్టుకు :—

పల్లేరు వేళ్లు, కాయలు. అడ్డసరపాకు, చిట్టాముదపువేళ్లు, శొంఠి కొండపిండివేళ్లు, కషాయంతోను, కర్పూరశిలాజిత్తు పొంగించి, వెలిగారం కూర్చియిచ్చేది. రాత్రిచిల్లగింజలు నిమ్మపండ్లరసం కూర్చియిచ్చేది, నీరు కట్టుమానును పల్లేరుకషాయం, వెలిగారం, గోసవిత్తులు నూరియిచ్చేది నీరుగొబ్బవేళ్లు, శొంఠి, పిండికొండవేళ్లు, చల్లగడ్డలు, సంబరేశిఆకు. వీనిని కషాయంబెట్టి క రాత్రిళ్లు యిచ్చేది. చింతగింజలబొబ్బెర నిమ్మకాయంత నూరి జీలకఱ్ఱ, శర్కర, ఆవునెయ్యి, ఆవుపాలుతోనూరి యిచ్చేది.

—: మేహాకట్టుకు :—

రావిపట్ట, ఆముదంపోసి వేయించి కడుపునకట్టేది. నీరుకట్టు గుణమౌను. సిద్ధక్రియ.

—: మూత్రఘాతచికిత్స :—

శ్లో. శ్రీగంధమాకులీబీజం తక్కోలం చైలవాలుకమ్ ।
ఖర్జూరం జీరకం ద్రాక్షాతవక్షీరీ శతావరీ ॥
తక్కోలం చాశ్వగంధాచ శాల్మలీ మధుయష్టికా ।
అశ్మగుప్తాఫలం ముస్తా శిగ్రుబీజవరాటకమ్ ॥ 518
కర్పూరంచశిలాధాతు చాతుర్జాతం తథానిశా ।
జాతీఫలం శిలాభేది ధాన్యాకోశీరకంతథా ॥ 519
క్షీరకందాచమత్స్యాక్షీ ...భూమిశర్కరా ।
యేతాని సమభాగాని శర్కరా చ సమంఘృతాత్ ॥ 520
మధునాకర్షమాత్రంతు లేహయేచ్చ యథావిధి ।
పూర్వాహ్నేత్వ పరాహ్నేతు గోక్షీరే యోజయేద్బుధః ॥ 521
తండులాంబునావా... రంభాయాస్వరసేనచ ।
అతిమూత్రం మహామూత్రం బహుమూత్రం మహాశ్మరీ ॥ 522
సర్వమేహాన్... చ మధునా మేహశర్కరా ।
నష్టేంద్రియంతథాదాహం...దోషంచపూయకమ్ ॥ 523
ఉదరం రక్తజంస్రావం నష్టపుష్పం ......... ।
పిత్తరోగాన్ చతుర్వింశద్రక్తపిత్తామ్లపిత్తకమ్ ॥ 524
విదాహం......... పిత్తస్యావరణం తథా ।
యేతాన్‌రోగాన్నిహంత్యాశు క్షీరాంబుపినాకినీ ? ॥ 525

తంగేడు బ...లు, బూరుగబంక, వేపబంక, నల్లతుమ్మబంక, ద్రాక్ష, ఖర్జూరం, యాలకులు, పిప్పలి, లవంగపత్రి, నాగకేసరాలు,

వాయువిలంగం, అతిమధురం, కలువగడ్డలు, చిల్లగింజలు, జీలకఱ్ఱ, తుంగముస్తలు, తంగేడువిత్తులు, పేలాలు, అల్లవిత్తులు ! కోష్టం, జటామాంసి, ధనియాలు, ఉశీరికపప్పు, కల్హార్, కల్హాదం వీనిని సమభాగం కూర్చి, చూర్ణంచేసి, యెనుముపెరుగు(గేదెపెరుగు)అరశేరున రేపుమాపు పుచ్చుకొనేది. యెనుముపాలు, యెనుముపెరుగు, మజ్జిగ, నెయ్యి. వెన్న కూర్చుకునేది, కందిపప్పు వర్జ్యం.

—: తైలము :—

ముశిముశాకు, పొన్నగంటిఆకు రసం, చిట్టిఆకురసం, తిప్పతీగె, చల్లగడ్డలు, గుంటగలగర ఆకురసం, కలబంద, తామరగడ్డలు, తుంగముస్తెలు, కలువగడ్డ, పెన్నేరుగడ్డలు, అన్నికషాయం నూనెకు సమభాగం యెళనీరు, పాలుసమం, కల్కం, త్రిఫల వొకద్రవ్యానికి చతుర్గుణం, కోష్టం, లవంగంపట్ట, కేసరం, అతిమధురం యాలకులు, జీలకఱ్ఱ మెంతులు, జాజికాయ, కురువేరు, వట్టివేళ్లు, పునుగుశట్టెం, పచ్చకర్పూరము, కలువగడ్డలు, తామెరగడ్డలు, పెన్నేరుగడ్డలు, పొన్నరక్కి? యీ ద్రవ్యాలు అన్నిన్ని నూనెకునాలుగింట్లో వొకపాలువేసి, మృదుపాకాన కాచి తలంటుకొనిన బహుమూత్రాలు మానును

—: నీరునిలుచుటకు :—

శ్లో. తింత్రిణీఫలజం కర్పాసాస్థివరాకులీ ।
బర్బరస్య కపిత్థస్య నిర్యాసం కతకం నిశా ॥ 526
శీతే ? గుంజాఫలం కాంతం అభ్రకస్యపృథక్పృథక్ ।
యజ్ఞాంగక్షీరసంయుక్తం వటీంకుర్యాత్ప్రయత్నతః ॥ 527
సప్తరాత్రప్రయోగేణ తటాకామపిశోషయేత్ ।

పెడతరఆకు, తంగేడుపూలు, నల్లపులుగుడుఆకు, దిరిశాకు, పత్తిఆకు, దూసరాకు ం నుగుపల్లేరు యీయేడు, తెగలపచ్చాకులున్ను, యెనుము మజ్జిగతో మర్దించి, ఆమజ్జిగను గ్రహించి తేనెకూర్చియిచ్చిన

నీరునిలుచును. తంగేడువిత్తులచూర్ణం, శ్రీగంధంచూర్ణం, చిల్లగింజలచూర్ణం, యీమూడున్నుకూర్చి, దీనిలో రెండువరాయెత్తుఅప్పు? కూర్చి తేనె, శర్కరకూర్చి యిచ్చిన మానును. తంగేడువిత్తులు, గొమ్ములక్క, యీ రెండున్ను చూర్ణంచేసుకొని, యెళనీరు, అత్తిపేరురసం, అరటిదుంపరసం, యీ మూడుకూర్చిదాంట్లో యిప్పపండు కూర్చి యిచ్చిన మానును పల్లేరుఆకు, బత్తెమజ్జిగను పిట్టుబెట్టి యిచ్చినమానును.

## —: అరుచికి :—

నేరేడుచిగుళ్లు, కషాయంబెట్టి దానిలో తేనె, శర్కర, ఆవునెయ్యి కూర్చి నాలుగుదినాలు యిచ్చిన అరుచితీరును, సైంధవలవణం, నిమ్మపండు ౧ అన్నంలోవేసి ముందుగా నేయి కూర్చితినిన తీరును

## —: జిహ్వాశోషకు :—

దానిమ్మ మొగ్గలు, పిందెలు, చిగుళ్లు, పూలు కషాయంబెట్టి, వెన్నకూర్చి యిచ్చిన శోషమానును తంగేడు సమూలం, వట్టివేళ్లు, కోష్టం, తుంగముస్తలు, ఉశీరిక, చెంగల్వగడ్డలు, కస్తూరిపసుపు, వగకు పలం ౧ కషాయం బెట్టి నెయ్యి శేరు ౧, ఎతిమధురం, యిప్పపువ్వు ద్రాక్ష, ఖర్జూరం, శ్రీగంధ సమ భాగంగా కూర్చి నలియకొట్టి యిచ్చిన మానును. తంగేడుసమూలం అడ్డసరంవేరు తిప్పతీగె కషాయం యిచ్చినమానును.

## —: నారికేళవటకము :—

శ్లో. నారికేళస్యవటకం రంభాయాఃకుసుమం పృథక్ ।
వింశత్పలం సమాహృత్య శ్వేతకృష్ణారిమేదజమ్ ॥ 528

అమ్రతిందుకాశ్వత్థప్లక్షన్యగ్రోధఫేనిలమ్ ।
పార్థంచోదుంబరంచైవమేహారి మూలమేవచ ॥ 529

అరగ్వధస్య మూలంచకతకాంఘ్రిపరాతథా ।
తేషాంకర్షం తతఃకృత్వాస్వాను గుప్తం నిధాపయేత్ ॥ 530

తచ్చూర్ణం కర్షమాత్రంతు మధునా సహ మేళయేత్ ।
నారికేళాఖ్య వటకం బ్రహ్మణా నిర్మితం పురా ॥ 531

సర్వమేహ వినాశాయ మేహ ప్రదర శాంతయే ।

—: చంద్రప్రభాఘుటిక :—

శ్లో. అశ్వత్థ బీజం హరిణస్య శృంగం తక్రేణ పీతం మధునా సహేత ।
ప్రమేహజాల సహసైవ హన్యాత్ దశాననం దా శరధిర్యథైవ ॥ 532

నింబం కపిత్థాన్ బదరీ పలాశాత్ శుక్లాశ్వకృష్ణా ... 533

—: మహాచందనాది తైలము :—

శ్లో. చందనం చాశ్వగంధాచ పంచాశత్పలికం తథా ।
తదర్ధం శారిబా ముస్తా వారాహీ వత్సకం తథా ॥ 534
బలాశతావరీశిగ్రు శైలూషం చ పునర్నవమ్ ।
యిందీవరం మృణాలంచ ఉశీరం పింగళం ? తథా ॥ 535
కుమారీ కట్ఫలం లాక్షా భూధాత్రీ గోక్షురం సమమ్
ప్రత్యేకం మర్దనం కృత్వా బుద్ధిమాన్ పరిచారకః ॥ 536
చక్రంవారి ? సమాదాయ ప్రత్యేకం తత్రనిక్షిపేత్ ।
అష్టభాగావశేషేస్మిన్ కషాయం మవతారయేత్ ॥ 537
కషాయం శోధయేత్పశ్చాత్ తిలతైలం చద్వ్యాఢకమ్ ।
బింబీచైలేయకం బ్రాహ్మీసింధువారం ప్రసారణీ ॥ 538
మత్స్యగంధీ చ మత్స్యాక్షీ భృంగరాజముపోదకీ ।
ప్రత్యేకం సర్వసప్రస్థం మస్తుప్రస్థంవినిక్షిపేత్ ॥ 539
నారంగంలకుచం ప్రస్థం గోక్షీరం చ వినిక్షిపేత్ ।
నారికేళోదకం చైవ క్రమాత్ మృద్వగ్ని నాపచేత్ ॥
తాళీసం మరిచం చవ్యం పుష్కరం గ్రంధి జీరకమ్
ధాన్యకం శర్పిపెల్లా ? చ వరాళం జాతిపత్రకమ్ ॥ 541

న బహ్వాఘ్రునబం ? స్వక్తా కర్పూరం కుంకుమంతథా ।
గోరోచన......తక్కోలం కోష్టకం మిశి ॥ 542

పీతరోహిణికామాంచీకటురోహిణి చోరకమ్ ।
జటామాంసీ హారిద్రా చ దార్వీత్వక్చంపకానిచ ॥ 543

శుతాసమం ? సమంచూర్ణం నారికేళన మిశ్రితమ్ ।
సుముహూర్తేసునక్షత్రే చావతార్యభిషగ్వరైః ॥ 544

ఏతమభ్యంజనంశ్రేష్ఠం శిరోరోగనివారణమ్ ।
షణ్ణవత్యక్షిరోగాంశ్చ నాశయేన్నాత్రసంశయః ॥ 545

అశీతిర్వాత జాన్రోగాన్ చత్వారింశతిపిత్తజాన్ ।
వింశతిశ్లేష్మరోగంచ నాశయేద్గళరోగహృత్ ॥ 546

బాలవృద్ధాది సేవ్యంచ......విశేషతః ।
వాయసంచ వికారఘ్నం హృద్దాహంకరిపాదజమ్ ॥ 547

సూతికా వాతజాన్ రోగాన్ జీర్ణజ్వర నికృంతనమ్ ।
ఏతాన్రోగాన్నిహంత్యాశు చక్షుష్యంకాంతివర్ధనమ్ ॥ 548

మహాచందనతైలాఖ్యమశ్వినీదేవనిర్మితమ్ ।

శ్రీగంధం యాభై ఆయిమపలాలు, పెన్నేరుగడ్డ, యాభై ఆయిదుపలాలు, సుగంధిపాల, కోరగెడ్డల, నేలతాటి, చిట్టాముట్టి, శతావరి, చల్లగడ్డలు, మునగ, గలిజేరు, చెంగల్వగడ్డలు, తామరతూండ్లు, పుశిరిక, నేలవుసిరిక, కలబంద, లక్క, పల్లేరు, సమభాగం, వగయిత్రిగి పవంతున కొట్టి అష్టభాగంగా కాచి నూనెతూము నాలుగుతూములు కషాయంపోసి కల్కంవేసికాచి తలంటుకోనేది. మూత్రాలు మానును.

## —— మహాలశునాద్యైరండతైలం :——

శ్లో. తులాంలశునఖండస్యతదర్ధం చిత్రకస్యచ ।
చవ్యం తదర్ధం తస్యార్ధం వల్కలం పూతికస్యచ ॥ 549

శిగ్రుశోభాంజనం (?) మూలంయవకోల కుళుత్థకం।
అశ్వగంధావరాదంతీ నిర్గుండీ చ పునర్నవా॥ 550

దశమూలముపానూర్గిం మరిచంనాగరంత్రివృత్।
వరుణా హాపుషా కృష్ణా తన్మూలం దేవదారుచ॥ 551

కురంటైరండయోర్మూలం నతం మోటంకర వచా।
కైడర్యయుతుక(?) శ్యామాపాఠామధురసాబలా॥ 552

ప్రత్యేకమేషాం ద్విపలం కుర్యాత్క్వథం జలేతథా।
చాతుర్భాగావశేషేస్మిన్ ముబ్తైలాఢకంపచేత్॥ 553

పలేనపంశాలస్య ? రామఠస్య పటోరపి।
సిధార్థకం యవక్షారం దీప్యకంజీరకద్వయం॥ 554

భార్గీ మూర్వా మహానింబా స్వర్ణక్షీరీ విడంగకం।
పశుగంధ్యభయాకాంతీ వత్సకాతివిషాత్రుటిః॥ 555

దేవదారువచాశిగ్రు నాగరంచేభపిప్పలీ।
ఏషాం తు కార్షికైర్భాగైః స్నుక్క్షీరస్యార్ధమానికమ్॥ 556

సర్వమేకత్రసంయోజ్య శనైర్మృద్వగ్ని నాపచేత్।
ఏతత్తైలంమహావీర్యం ధన్వంతరివినిర్మితం॥ 557

గుల్మంశూలముదావర్తం ప్లిహాధ్మానం వినాశయేత్।
యకృత్ప్లీహోదరాష్ఠీలా శ్లేష్మోదర గుదక్రిమీన్ 558

పార్శ్వశూలంచ హృచ్ఛూలం అంతర్విద్రధికూర్మకం।
కోష్టవాతాంత్రవృద్ధిం చ నాశయేన్నాత్రసంశయః॥ 559

## —: తిక్తకోశాతకీతైలం :—

తిక్తకోశాతకిప్రస్థమజాక్షీరంచతిత్సమమ్।
భృంగరాజరజప్రస్థం ఘృతంకుడుంబసమ్మితం॥ 560

యేరండతైలకుడుంబం ప్రస్థార్థం తిలతైలకం ।
కిరాత త్రిఫలాకుష్ట మధుకోశీరశారిబాః ॥ 561

శిరోవస్థాతుతద్యుంద్యాదస్థి రోగేవిశేషతః ।
తి క్తకోశాతకీతైలమశ్విభ్యాం నిర్మితంపురా ॥ 562

—: అశ్వగంధాదిఘృతం :—

శ్లో. అశ్వగంధా బలా భీరు స్థిరా జీవంతి గోక్షురైః ।
ఏషాం తులాం జలద్రోణే పచేదష్టాంశశేషితమ్ ॥ 563

సర్పిః ప్రస్థంపచే త్తస్మిన్ ద్విగుణ క్షీరసంయుతం ।
చందనోత్పల యష్ట్యాహ్వకృష్ణా ద్రాక్షాశతేరుకః ॥ 564

ద్విమేదా దారు మంజిష్టాతుగా పద్మంప్రపౌండ్రకమ్ ।
దురాలభా విమతుటీ ? శృంగీ భార్ఙ పునర్నవా ॥ 565

ఆశీర్వతి ? విషా ముస్తా వాలుకోశీర సాగరైః ।
నిమ్కద్వయ ప్రమాణేన కల్కద్రవ్యాణి దాపయేత్ ॥ 566

ర క్తపి త్తం రుజః క్రిమిణాంతథా విస్ఫోటకామలే ।
అంగదాహంశిరోదాహం పాదదాహ మరోచకమ్ ॥ 567

కాసశ్వాసప్రతిశ్యాయశోషశోధగదాం స్తథా ।
సర్వజ్వరహరం నూనంక్షయవ్యాధి హరం పరమ్ ॥ 568

అశ్వగంధాఘృతం శ్రేష్ఠమశ్విభ్యాం నిర్మితంపురా ।

—: జంబూవల్కల ఘృతం :—

శ్లో. జంబూత్వ గర్జునప్లక్ష దాడిమామ్రముదుంబరమ్ ।
అశ్వత్థ ధాతకీమోచా ప్రత్యేకం వల్కపంచకం ॥ 569

అష్టభాగావశేషేస్మిన్ కషాయేతు పరిశ్రుతం ।
క్షీర్వాస్మిన్ గోఘృత ప్రస్థంశతావర్యార సంతథా ॥ 570

నారికేళాంబు గోక్షీరమట రూషసమంతథా।
శుంఠీమధుక మృద్వీకార క్త చందనమల్పలం॥ 571

కట్వంగ వత్సకాత్సం భ(?)ధాతకీ మధుకాఞ్జనం
కల్హారలాజా మంజిష్టా జాతీఫల లవంగకం॥ 572

ద్రాక్షా ఖర్జూర తాళీసం లామజ్జక మృణాళకం।
ప్రత్యేకం కర్షమాత్రంతు సూక్ష్మచూర్ణాని కారయేత్॥ 573

సుముహూర్తే సునక్షత్రే సుపక్వమవతారయేత్।
మృగనాభిం చ కర్పూరం కర్షార్థం ఘృతమిశ్రితం॥ 574

ప్రాతరుత్థాయ సేవేత స్త్రీణాంపుత్రప్రదం శుభం।
యోనిదోషం రజోదోషం శ్యావశ్వేతారుణాపహః॥ 575

సప్లుతావిప్లుతా యోనిః స్తబ్ధపిచ్ఛిల స్రావిణీః।
యోనిః స్ఫుటనశూలిని॥ 576

జంబూవల్క ఘృతం శ్రేష్ఠమ శ్విభ్యాం నిర్మితంపురా।

—: చందనాది ఘృతం :—

శ్లో. చందనం మధుకం ముస్తా లామజ్జం కటురోహిణీ।
కళింగం క్రిమిజం ద్రాక్షా పటోలం ధన్వయాసకమ్॥ 577

చపలా పర్పటం బిల్వం త్రాయమాణాజమోదకం।
హ్రీబేరం సరళం కుష్ఠం ధాత్రీ చామలకీ శఠీ॥ 578

వ్యాఘ్రీ భూనింబ వాపుషా శతాంహ్వామాలతీమురా।
పృథక్పలమితంక్షుణ్ణం జలద్రోణే విపాచయేత్॥ 579

చాతుర్భాగావశేషేస్మిన్ ఘృతప్రస్థంపయస్సమమ్।
ఏభిస్సమస్తైః కర్షాంశైః కల్కద్రవ్యాణిదాపయేత్॥ 580

ఘృతంపరిశృతం పక్వం జీర్ణజ్వర నికృంతనమ్ ।
శీతం...విషమం చిరకాలజ్వరం జయేత్ ॥ 581

క్షయంక్షయకృతాంశ్చ వ్యాధీన్ శ్వాసకాసమరోచకమ్ ।
శూలానాహప్రశమనం సర్వవ్యాధినివారణం ॥ 582

చందనాదిఘృతం నామ చంద్రాత్రే! చంద్రభాషితం ।

—: పునర్నవాదిఘృతం :—

శ్లో. పునర్నవస్యమూలానిపంచ వింశత్యలంభవేత్ ।
శిగ్రుకంచిత్రమూలంచ పూతీకంలశునంతథా 583

ఏరండస్య మూలాని శ్వదంష్ట్రా చ కులుత్థకమ్ ॥
ఏతాని తు విజానీయాత్ పునర్నవసమానిచ । 584

ద్రోణద్వయజలం దత్వా చతుర్భాగావశేషితమ్ ।
అత్రకల్కంసమానీయ పేషయేత్సూక్ష్మకల్పితమ్ ॥ 585

పిప్పలీసైంధవంశుంఠీ చిత్రకోహస్తిపిప్పలీ ।
హింగువర్షాభుమూలం చ చవ్యంగోక్షురకం తథా ॥ 586

ఏతాని సమభాగాని సమ్యక్పిష్ట్వా ప్రదాపయేత్ ।
క్షీరంచతుర్గుణందద్యాత్సమ్యఙ్మృద్వగ్ని నాపచేత్ ॥ 587

ఏతత్సిద్ధ ఘృతంహన్యాద్గుల్మం శూలంసుదారుణమ్ ।
హృద్రోగేషుచ శూలేషు పాండురోగే హలీమకే ॥ 588

యకృద్రోగే ప్లీహరోగే వాతాష్టీలే తథైవచ ।
పిత్తశ్లేష్మహరంశ్రేష్ఠం సర్వవ్యాధిహరంపరమ్ ॥ 589

టీ. గలిజేరు వేళ్లు, మునగ వేళ్లు, చిత్రమూలం, తపశి వేళ్లు, ఆముదం వేళ్లు, పల్లేరు వేళ్లు, నల్లవులవలు, యివి ఒక్కొక్కటి యిరువై అయిదుపలాలు లెఖ్ఖనుగెకూర్చి యెనిమిదితూములు నీళ్లుపోసిచాతుర్భాగంగా కాచి, అందులోనాలుగుఅడ్డలు నీళ్లుపోసి, అందుపాలుపోసి కల్కద్రవ్యాలు,

పిప్పళ్లు సైంధవలవణం, శొంఠి, చిత్రమూలం, గలిజేరువేళ్లు, యింగువ, గజపిప్పళ్లు, చవ్యం, పల్లేరువేళ్లు, వగకుపగ, లెఖకూర్చి చూర్ణం చేసి, నీళ్లలోనూరి ఆ ఘృతములోకలిపి, సన్నపుమంటను పాకంచేసి. పక్వానదించి అరచేతి గుంటడు పుచ్చుకొనిన శ్లోకములోచెప్పిన రోగాలు మానును.

—: గ్రహాణికి శుంఠ్యాదిఘృతము :—

శ్లో. శుంఠ్యాస్తుద్వాదశపలం జలద్రోణే విపాచయేత్ ।
చతుర్భాగావశేషేతు కషాయమవతారయేత్ ॥ 590

సర్పిషఃప్రస్థమావృత్య ద్విప్రస్థం క్షీరసంయుతమ్ !
శనైర్మృద్వగ్నినాకుర్యా న్మృదుపాకంవిచక్షణః ॥ 591

అగ్నేశ్చదీపనంచైవ వ్యాక్షి రోగ వినాశనమ్ ।
శుంఠీఘృతమిదం దేయం శ్రేష్ఠంకాశ్యప నిర్మితం ॥ 592

—: జంబ్వాదిఘృతం :—

శ్లో, జంబూత్వచః శతపలం జలద్రోణేపచైచ్ఛనైః ।
పాదావశిష్టేపూతేతు ఘృతప్రస్థం ప్రదాపయేత్ ॥ 593

గోదధిప్రస్థసంయుక్తం ప్రస్థందత్వాభిషగ్వరైః ।
మధుకంబిల్వమూలంచ సింధుమోచరసంతథా ॥ 594

నాగకేసరకం ద్రాక్షా పద్మకేసర వత్సకం ।
ఖర్జూరం దాడిమం పాఠా చూతబిల్వశలాటుకం ॥ 595

యవానీముస్తకంచూర్ణం కర్షమాత్రం ప్రదాప యేత్ ।
ఘృతంవిపాచయేద్ధీమాన్ కల్కస్నేహాద్రవైస్తథా ।
రక్తపిత్తంతథారక్త ప్రదరంగ్రహాణీగదం ॥ 596

రక్తాతిసారంమేహాంచ జంబూఘృతమిదంజయేత్ ।

—: అశ్వగంధాదిఘృతము —

శ్లో. అశ్వగంధేక్షురంభాభిః దూప (?) కండూకరీఫలైః ।
ముసలీ గోక్షురాభ్యాంచ కషాయేష్టాంశ శేషితే ॥ 597

రసేనేక్షుః శతావర్యాః ఘృతంక్షీరం చతుర్గుణమ్ ।
ద్రాక్షా ఖర్జూర యష్ట్యాహ్వ కాకోలీద్వయ జీరకైః ॥ 598

ప్రియాళుబీజేనాశ్మర్యా స్థిరా హంసపదీ ఘనైః ।
శక్యాచ సాధితం సర్పిః శుక్లవర్ధన శోధనం ॥ 599

వంధ్యానాం పుత్రజననం బల్యం పుష్టిం కరోతి చ ।

—: కదలీకందఘృతము :—

శ్లో. కదలీవృక్ష కందస్య తులాం ద్రోణే జలే పచేత్ ।
అష్టభాగావశేషేస్మిన్ న్యగ్రోధా దిగణైస్సహ ॥ 600

క్షీరప్రస్థం జలప్రస్థం కల్కద్రవ్యాణి దాపయేత్ ।
మూత్రకృచ్ఛ్రా న్వాతమేహా నుదరాన్గ్రహణీ గదం ।
ప్రమేహం వింశతిం హన్యాత్ రామోరక్షో గణాని వ ॥ 601

శారిబామలకై ర్ముస్తా చందనం నలదం తథా ।
కచోరం కేతకంచైవ ద్రాక్షా ఖర్జూర మేవచ ॥ 602

త్రికటుం ధాన్యకం చైవ జీరకం గజపిప్పలీ ।
చాతుర్జాతం లవంగం చ కర్షాంశం శ్లక్ష్ణ చూర్ణితైః ॥ 603

వింశత్పలిక మాత్రంతు శర్కరాం చ వినిక్షిపేత్ ।
సమ్యక్పక్త్వా ఘృతంధీమా న్ప్రాతః ప్రాతం తు సేవయేత్ ॥ 604

—: మూర్ఛవాయువులకు బింబ్యాది ఘృతము :—

శ్లో. కాకబింబీ శతావర్యా......చాటరూషకమ్ ।
గోక్షురం పిచుమందంచ వన్య ముద్గార్ధ చంద్రికాః ॥ 605

సర్వాణ్యేతాని పత్రాణి మూలం చైవ విశేషతః ।
సంక్షుద్య స్వరసం పిష్ట్వా ప్రత్యేకం ప్రస్థమాత్రకమ్ ॥ 606

గోఘృతం ప్రస్థమాత్రంతు వ్యాజాక్షీరం చతుర్గుణం ।
ఏతేషాం స్వరసం క్షీరం ఘృతేనసహ పాచయేత్ ॥ 607

త్రిగంధం త్ర్యూషణంచైవ త్రిఫలా యష్టిచందనం ।
ఖర్జూరం జీరకేద్వే చ లవంగం నాగకేసరం ॥ 608

ఏతాని సమభాగాని ప్రత్యేకం కర్షసమ్మితం ।
భూనాగం ద్విపలక్షుణ్ణం అజాక్షీరేణ పేషయేత్ ॥ 609

సుపక్వే తు ఘృతే దద్యాత్ పలం వింశతిశర్కరా ।
బింబాదికం ఘృతం చైవ పచేత్ ఘృతసమన్వితమ్ ।
ఉన్మాదం చ స్మృతిభ్రంశ మపస్మారం చ నాశయేత్ ॥ 610

—: త్రిఫలాదిఘృతము :—

శ్లో. త్రిఫలాయాఃరసః ప్రస్థం ప్రస్థం భృంగరసస్తథా ।
వృషస్య స్వరస ప్రస్థం శతావర్యాశ్చ తత్సమం ॥ 611

అజాక్షీరం గడూచ్యాశ్చ హ్యామలక్యాశ్చ తత్సమం ।
ప్రస్థంప్రస్థం సమానీయ ఘృతేనసహ పాచయేత్ ॥ 612

కల్కైః కణా సితా ద్రాక్షా త్రిఫలా నీలముత్పలం ।
మధూకం క్షీరకాకోలీ మధుపర్ణీ నిదిగ్ధికా ॥ 613

ఏలాం లవంగం ముస్తాం చ కుష్ఠం దారు నిశాద్వయమ్ ।
ఏతాని సమభాగాని ప్రత్యేకం కర్షసమ్మితమ్ ॥ 614

సుపక్వంకారయే ద్ధీమాన్ శనైః ర్మృద్వగ్నినా తతః ।
త్రిఫలాది ఘృతం నామ చక్షుష్యం ధాతువర్ధనమ్ ॥ 615

కాంతి పుష్టికరం వృష్యం దీపనీయం రసాయనమ్ ।
శోషిణాం క్షీణదేహానాం బాలానాంచాంగవర్ధనమ్ ॥ 616

భక్షయేత్ ప్రాతరుత్థాయ చక్షూరోగ నివారణమ్ ।
కర్ణరోగం ర క్తపి త్తం పాండురోగంచ నాశయేత్ ॥ 617

—: పాండురోగాలకు మందు :—

లశునం ప. ౪, వోమం ప. ౪, నల్లజీలకఱ్ఱ ప. ౧, మిరియాలు ప. ౧, దేశావరం, పిప్పలిమూలం ప. ౧, లవంగాలు, ఉక్కురాపొడి ప. ౪, సైంధవలవణం ప. ౨ చూర్ణంచేసి వుంచుకొని నిమ్మపండ్లు ౨౦ నాలుగుగా చీల్చుకొని, పుల్లిపొట్లు తీసి ౨౦ పండ్లలో సరిగ వుంచేది. ఈ నిమ్మపండ్లు వొక పిడతలోవుంచి, దానిపైన మునుపటి చూర్ణం సైంధ వలవణమున్ను వలువైవులచల్లి మంచినూనె అరశేరు పోసేది. తరు వాత అల్లపురసం శేరుపోసేది. గుంటగలిజేరురసముచే మెత్తగానూరి కుండలో వుంచుకునేది. నిత్యం పోకంతమందు తినిన శోఫలు, అసాధ్య మైన పాండురోగాలు మానును. ఈ ఔషధం ఎండినచో గుంటగలగర ఆకురసంపోసి నూరి పదునుచేసుకొని వుంచేది. సిద్ధక్రియ.

—: పాండుకు ప్రయోగము :—

ఇనుపచిట్టెం, ఉక్కురాపొడి, కాంతం ఈ మూడున్ను గుంటగల రాకు స్వరసం నూరి బిళ్లజేసి వొకపుటంవేసి, యెత్తి వుంచుకొని అందు శొంఠి, పిప్పలి, మిరియాలు కానుగవేళ్లపట్ట, నల్లెరు ఈ ఐదున్ను వగకు ప. ౧ మునుపు చెప్పిన 3 వగలున్ను మూడుపలాలు కొట్టి చూర్ణంచేసి వీటినన్నిటిని గుంటగలిజేరు ఆకు స్వరసంపోసి నూరి గచ్చ కాయంత మాత్రలుచేసి వుంచేది. ఇందుకు పథ్యం మజ్జిగ అన్నం. వుప్పు కొంచెంగా కూర్చుకొనేది.

—: భావనాహరితకి :—

శో. శతంసమాదాయ హరీతకీనా మస్మూరనాశే దశ వాసరాణి ।
నిధాయ నిర్వాప్య దినత్రయే చ పునఃపునః కాంజిక మాదధీత ॥ 618

తతో ద్విభాగాన్ ప్రవిభజ్య బీజాన్ ఆకృష్య తక్రే విపచేత్ప్రవీణః ।
చతుర్థభాగం లవణం యథావత్ తక్రే తస్మై క్షిప్యతి మందవహ్నౌ ॥

కణా కణామూల హుతాశ తస్మైశ్చ కర్షాన్వితై రర్థపలప్రమాణైః
యవానికా దీప్యమరీచ జీరకైః సవిశ్వ సింధూత్థ యుతైః సుచూర్ణమ్॥

యోజ్యం ముజంబీరరసేన సర్వం విభావయేదార్ద్రికవారిణావా ।
ద్విత్రీణిదద్యాద్దిన పూర్వభాగం ప్రాగ్భుక్తకం సోత్తరభుక్తకంవా ॥
గుల్మానిల ప్లీహగుదామయాగ్ని మాంద్యోదరచ్ఛర్ద్యరుచి జ్వరేషు ।
శ్వాసేషు కాసేషు హృదామయేషు విషూచికాసగ్రహణీగదేషు ॥622
అన్నద్విషే పాండుగదాఖ్యపైత్యే శూలేషు సర్వేషు చ పీనసేషు ।

నూరు కరక్కాయలు పచ్చిబియ్యం కడిగినకుడితిలో వేసి దినము విడచి దినము పారపోసి తిరుగపోసి తిరుగ పదిరోజులు ఎండ నిచ్చి ఆపిమ్మట కరక్కాయలు గ్రహించివిత్తులు పారవేసి వలువు భద్రపరచవలెను నాలుగింట్లో వొకపాలు లవణం వేసి పెరుగుపోసి పొయ్యిమీదవుంచి సన్నపు మంటవేసేది. పిప్పలీమూలం, వోమం, మిరియాలు, జీలకఱ్ఱ, శొంఠి, సైంధవలవణము, తానికాయ, ఉశిరికపప్పు వగకు ప. ర వంతున చూర్ణంచేసి నాల్గింట్లో వకపాలు సైంధవలవణం వేసి నిమ్మపండురసంతో నూరి గచ్చకాయంత వుండచేసి పూటకు వక వుండ ఇచ్చేది.

—శిగ్రుపుష్పరసాయనము :—

శ్లో. శిగ్రుపుష్పరసప్రస్థం తత్ఫలంతరుణం తథా
వారాహీకందజం చూర్ణంప్రరోహాగ్రం వటస్య చ ॥ 623
పృథక్ త్రిపలకం క్షుణ్ణం సర్వం సంయోజ్య బుద్ధిమాన్ ।
ద్విప్రస్థం కేశజం క్షీరం గోక్షీరం చాఢకద్వయమ్ ॥ 624
ఘృతేపాదావశిష్టేతు ఘృతద్విప్రస్థసంయుతమ్ ।
వరాళం జాతిపుష్పం చ జాతీఫలమదూలకా (?) ॥ 625

గోజిహ్వామర్కటీబీజం కందం కాంతరజస్యచ ।
ప్రత్యేకంకర్షమాత్రంతు చూర్ణంకృత్వాక్షిపే త్తతః ॥ 626

లేహ్యపాకే శర్కరాయాః ప్రస్థం క్షౌద్రస్య తత్సమమ్ ।
సర్వంసంయోజ్య తత్సర్వం జగ్ధం సర్వం చ లేహయేత్ ॥ 627

స్తంభనం ధాతువృద్ధిం చ రక్తమాంసబలప్రదమ్ ।
చక్షుష్యం మూత్రరోధం చ నాశయేన్నాత్ర సంశయః ॥ 628

రసాయనవరం పుంసాం గచ్ఛేచ్చప్రమదాశతమ్ ।

— అశ్వగంధారసాయనము :—

శ్లో. అశ్వగంధాపలంవింశత్ సూక్ష్మచూర్ణంతుకారయేత్ ।
ప్రస్థత్రయం తు గోక్షీరం తద్ఘృతం ప్రస్థమాత్రకమ్ ॥ 629

సర్వమేకీకృతం పాత్రే శనై ర్మృద్వగ్నినా పచేత్ ।
పక్వం తు లేహ్యతాం యాతం శర్కరార్థతులాం క్షిపేత్ ॥ 630

చాతుర్జాతక ధాన్యాకం ద్రాక్షా ఖర్జూర చందనమ్ ।
జాతీఫలం వటశృంగం తుగాక్షీరీ కటుత్రయమ్ ॥ 631

హ్రీబేరం దేవకుసుమం గ్రంధికం చవ్యచిత్రకమ్ ।
ప్రత్యేకం కర్షమాత్రం తు సూక్ష్మచూర్ణాని కారయేత్ ॥ 632

ఘృతార్థం మాక్షికం దత్వా శీతీభూతే ప్రదాపయేత్ ।
యథాకాలబలం జ్ఞాత్వా ప్రాతఃకాలే చ సేవయేత్ ॥ 633

ద్వాదశ క్షయరోగాంశ్చ శోషమేకాదశం తథా ।
రక్తపైత్యం చామ్లపైత్యం కామిలా పాండు రోగనుత్ ॥ 634

అగ్నిదీప్తికరంవృష్యం తేజోధాతువివర్ధనమ్ ।
పూజ్యపాదేనరచితం అశ్వగంధారసాయనమ్ ॥ 635

—: గంధకరసాయనము :—

శ్లో. గంధకం షట్పలం చూర్ణం త్రిఫలా చిత్రతండులమ్ ।
త్రికటు త్రిసుగంధం చ కణాభల్లాతజీరకమ్ ॥ 636

చిత్రకం చ పలం చైవం చూర్ణితం వస్త్రగాళితమ్ ।
యేకనిష్కం ద్వినిష్కం చ త్రినిష్కం భక్షయేదను ॥ 637

సినాదా మధునా వాథ నవనీతేన తల్లి పేత్ ।
కదళీఫలసారేణ శతావార్యారసేనవా ॥ 638

తైలామ్లసర్పి పానినాం వర్జయేల్లవణంభృశమ్ ।
దీర్ఘాయుః కుంజరబలో తురంగఇవ వేగవాన్ 639

దివ్యదేహబలో భూత్వా ఖేచరం తస్య జాయతే ।
తస్యమూత్రపురీషాభ్యాం శుల్బంభవతికాంచనమ్ ॥ 640

కుష్టమష్టాదశంచైవ గ్రహణీంచ చతుర్విధమ్ ।
మందాగ్నింబలసాదం చ గుల్మమష్టవిధం తథా ॥ 641

హన్యాత్కుర్యాద్బలంపుష్టిం గమయేద్వసితాశతమ్ ।
.............. స్తంభనంవీర్యవర్ధనమ్ ॥ 642

మనుష్యాణాంహితార్థాయ హ్యశ్విభ్యానిర్మితం పురా ।

—: తాళీశవటకము :—

తాళీసపత్రం మరీచం చవికానాం పలంఫలమ్
కృష్ణా తన్మూలయో ర్ద్వే ద్వే పలే శుంఠీ పలత్రయమ్ ॥ 643

చాతుర్జాతముశీరం చ కర్షాంశం శ్లక్ష్ణచూర్ణితైః ।
గుడేన వటకాన్ కృత్వా త్రిగుణేన చ దాపయేత్ ॥ 644

కాసం శ్వాసం క్షయం గుల్మం హృద్రోగం గ్రహణీగదమ్ ।
అగ్నిమాంద్యం జ్వరంచ్ఛర్దింపీనసం చ వినాశయేత్ ॥ 645

### —: మహాపూతీకాదితైలము :—

శ్లో. దశమూల బలా దారు హింస్రాభూతీక చిత్రకాః ।
నిర్గుండీ చాశ్వగంధా చ హ్యర్క-మూలం పునర్నవా ॥ 646

శుంఠీ గంధర్వహస్తా చ కులుత్థ యవ మాషకాః ।
ఓ తేషాం చ సమంరాన్నా పూతికం చ తయోస్సమమ్ ॥ 647

చతుర్గుణే జలే పక్త్వా చతుర్భాగావశేషితే ।
తత్క-షాయం పరిస్రావ్య తైలం క్షీరం చతుర్గుణమ్ ॥ 648

మృద్వగ్నినాపచేత్తైలం ద్రవ్యైరేతైస్సుచూర్ణితైః ।
మధుకంశారిబామాంశీ మిశికాంతికణానసైః ॥ 649

వచా గంధకచోరైలా దార్వీ దారునిశోషసైః
పథ్యాశ్వగంధాయష్టాక్షి గ్రంధి గీప్యక నాగరైః ॥ 650

విడంగాగరు మంజిష్టా భ్రష్టాగండీరచిత్రకైః ।
సిద్ధం తైలం జయేద్వాతాన్ వస్త్యభ్యంగాదిమర్దనైః ॥ 651

అర్దితం చ హనుస్రంసం జిహ్వాస్తంభం శిరోగ్రహమ్ ।
శిరోరోగాంశ్చ సర్వాంశ్చ కపాల గళజాన్ గదాన్ ॥ 652

మహాపూతీకనామ్నైతదశ్విభ్యాం నిర్మితం పురా । 653

### — మహామధుస్నుహిరసాయనము :—

శ్లో. త్రికటు త్రిఫలా భార్గీ రాస్నా చైవ విడంగకమ్ ।
కోష్ఠం త్రిజాతకం ముస్తా తాళీసం నాగకేసరమ్ ॥ 654

తక్కోలం తగరం పాఠా గ్రంధికం పిప్పలీవచా ।
మధుకోశీర కటుకా ధాన్యకం జీరకద్వయమ్ ॥ 655

జాతీఫలం చ తత్పత్రం లవంగం దీప్యకద్వయమ్ ।
కాకమాచీ చ దుస్పర్శాగోజిహ్వా రేణుకం తదా ॥ 656

శిలాజతు ద్వయం చైవ పాటలీ చాశ్వగంధికా।
శాల్మలీవృక్షనిర్యాసం పురా శ్రీఖండ సంయుతమ్॥ 657

కాలధూమం దేవకాష్ఠం కృష్ణాగరు సమన్వితమ్।
శిగ్రుమూలం వచా హింగు వారాహీ శుక్లకందకమ్॥ 658

కోకిలాక్షీ మహాగుప్తా బదరీ భూమి శర్కరా।
త్రికత్రా పటోల భూనింబా త్రిక్షారం వాహ్యమూషకమ్ (?)॥ 659

కైడర్యం బర్బరం బిల్వం కచోరం తులశీద్వయమ్।
త్రివృతాఽరళు సంయుక్తమయశ్చూర్ణ సమన్వితమ్॥ 660

ఏకైకమేషాం కర్షాంశం సమభాగైస్తు చూర్ణితమ్।
మధుస్నుహీ చ సంచూర్ణ్య పూర్వచూర్ణే తు మేళయేత్॥ 661

చూర్ణస్య పంచమోభాగః బలిచూర్ణం చ నిక్షిపేత్।
తతః సర్వసమం యోజ్యం శర్కరామధుసంయుతమ్॥ 662

సారఘుం సహసమ్మిశ్ర్య ! కర్షమాత్రంచ సేవితమ్।
యేకమండలమాత్రేణ సర్వవ్యాధిహారంపరమ్॥ 663

అశీతివాత హరణం శూలగ్రంధి నివారణమ్।
శోభ వాత హారం శ్రేష్ఠం పిత్తశ్లేష్మనివారణమ్॥ 664

కాస శ్వాస హారం బల్యం సప్తధాతువివర్ధనమ్।
జీర్ణజ్వరహారం ప్రోక్తం అగ్నిమాంద్య నికృంతనమ్॥ 665

ప్రమేహం మూత్రకృచ్ఛ్రాణి భగందర గదం హరేత్॥ 666

నామ్నా మధుస్నుహీ లేహ్యం రసాయనపరంశుభమ్।
నరాణాం రోగనాశాయ పురా ధన్వంతరికృతమ్॥ 667

శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయ, తానికాయ, ఉశిరికపప్పు గంటుభారంగి, దుంపరాష్ట్ర, వాయువిడంగం, కోష్టం, యేలకులు, లవంగపత్రి, లవంగపట్ట, తుంగముస్తలు, తాళీసపత్రి, నాగకేసరం,

తక్కోలం, గ్రంథితగరం, పిప్పలీమూలం, గజపిప్పలి, అతిమధురం, వట్టివేళ్లు, కటుకరోహిణి, కొత్తమిల్లి, జీలకఱ్ఱ, జాజికాయ, జాపత్రి లవంగాలు, వోమం, ఖురాసానివోమం, ద్రాక్ష, ఖర్జూరం, పెద్ద బచ్చలివేళ్లు, రేణుకలు, చవ్యం, సైంధవలవణం, గలిజేరివేళ్లు, ములు తెంపలి, కర్పూరశిలాజిత్తు, తవక్షీరి, గోమూత్రం, వుప్పివేళ్లు, పెన్నేరుగడ్డ, వాకుడువేరు, పల్లేరువేళ్లు, గోరోచనం, సదాపవిత్తులు జ్యోతిష్మతివిత్తులు, బూరుగబంక, మహిసాక్షిగుగ్గులు, మలాకా ! చక్క, గ్రంథిరాజు ! సరళదేవదారు, కృష్ణాగరు, మునగవేరు, వస భస్మం, ఇంగువ, నేలతాటిగడ్డలు, అతివస, గాలిమిడి, ఆకుతింట ! కలివిందవేరు, నేలగుమ్మడిగడ్డలు, భూశర్కరగడ్డలు, చేదుపొట్ల, నేలవేము, సర్జక్షారం, యవక్షారం, వెలిగారం, చాటువ్వ, కరివేప యీనెలు. వావింటవేరు, మారేడువేరు, కచోరాలు, శ్రీతులశీవేరు, భూతులశీగడ్డలు, పెద్దమానిపట్ట, లోహసిందూరం, పరంగిపట్ట వగకుఱి పరంగిపట్ట సమం శర్కర రెండుపాళ్లులేహ్యాం చేసి యిచ్చిన యీ యోగమందు చెప్పిన రోగాలు మానును.

—: మహాకల్యాణ ఘృతము :—

శ్లో. వారాహీ చిత్రమూలం చ గోక్షురం గోపకన్యకా ।
బృహత్స్యాలావృతీ (?) మూలం విశాలా చ బలాద్వయమ్ ॥ 668

పాటలీ బిల్వమూలంచ పునర్నవ శతావరీ ।
ఉశీరద్వయ ముస్తాచ హయగంధా కశేరుకమ్ ॥ 669

మధుస్రవా గుడూచీ చ దుత్తూరం పద్మకేసరమ్ ।
పృథక్ సపలికా (?) కృత్వా జలద్రోణే విపాచయేత్ ॥ 670

చాతుర్భాగావశేషే తు కషాయం తు పరిస్రుతమ్ ।
ధాత్రీరసం మోచరసం కూష్మాండేక్షుజమిక్షురమ్ ॥ 671

(దిష్ఠిరారజనీ) నారికేళ జలం రంభాకందం మత్స్యాక్షీ తండులీ ।
రాజకన్యామృతాసంతా ముసలీ చ శతావరీ ॥ '672

ఏతేషాం స్వరసం ద్యద్యాత్ కషాయేణ చ మేళయేత్ ।
వరాళ చవ్య మధుకం మధూకం కుష్ట చందనమ్ ॥ 673

సరళం దేవదారుం చ తక్కోలం శారిబాద్వయం ।
ద్వి స్థిరా రజనీ మాంశీ వత్సకాతివిషా తథా ॥ 674

పునర్నవా చ మృద్వీకా నీలోత్పల పరూషకం ।
రోహిణీ చవ్య లవణం ద్విక్షారం గజపిప్పలీ ॥ 675

ఏలా తాళీసపత్రైలా మాలతీముకుళానిచ ।
కర్షాంశం చూర్ణితంకృత్వా సర్పిణాలోడ్య పాచయేత్ ॥ 676

సర్పిప్రస్థః పయఃస్తుల్యం శనైర్మృద్వగ్నినా పచేత్ ।
సమ్యక్పాత్రం పరిస్రావ్య గణేశం పూజయే త్తథా ॥ 677

ధాన్యరాశి స్థితం పక్షం గృహీత్వా బుద్ధిమాన్ భిషక్ ।
సుదినే శుభనక్షత్రే శుద్ధకాలేచ రోగవాన్ ॥ 678

మండలం సేవయే దేతత్ దధ్యన్నం పథ్యభోజనమ్ ।
క్షయోదర మహోన్మాద కాస శ్వాసాది పాండుజిత్ ॥ 679

పాండురోగం విశేషేణ సోమరోగం ప్రమేహరుక్ ।
అశీతస్స్వల్పరజసీ శుక్లవృద్ధికరం పరం ॥ 680

అంగదాహం శిరోదాహమ్మృతుశూలం నివారయేత్ ।
అక్షిరోగానశేషాంశ్చాపస్మారం చతుర్విధం ॥ 681

విసర్పరోగం క్షయం చైవ గుల్మోదర వినాశనమ్ ।
గ్రంధి విద్రధి గుల్మార్శో యోనిశూలంచ గుల్మనుత్ ॥ 682

బల్యం మాంగళ్యమాయుష్యం కాంతి లావణ్య పుష్టిదమ్ ।
వంధ్యానాం గర్భజననం మందబుద్ధిం చ నాశయేత్ ॥ 683

మహాకళ్యాణకం నామ దేవదేవ మహాప్రియమ్ ॥

శేలతాటి, చిత్రమూలం, పల్లేరు, సుగంధిపాల, గుంటగలగర, పాపర, బలాద్వయం, పాదిరి, బిల్వమూలం, గలిజేరు, చల్లగడ్డలు, ఉశీరిక, నేలవుశిరిక, కోరగడ్డలు, పెన్నేరుగడ్డ, కశివింద, తిప్పతీగె, తియ్యని తిప్పతీగ, వుమ్మెత్త, తామర కేసరాలు ప్రత్యేకం వగకు పలం ౧ వంతు గ్రహించి కొట్టిన లుత్తుం ? నీళ్లుపోసి నాల్గింట్లో వొకపాలుగా కాచి స్వగసద్రవ్యం, వుశిరికాయ, బూరుగపట్ట, పెద్దగుమ్మడికాయ, రసదాళి, చెరుకుపాలు, యెళనీరు, అరటిగడ్డ, పొన్నగంటి, శెరుకోకారె, వల్లారె, వులియారె, కొత్తాన్, నెలప్పనె, చల్లగడ్డలు, వగకు అరపలం వంతు కూర్చుకొని కషాయం, నెయ్యిపయుడు కలిపి. లవంగాలు, చవ్యం, అతిమధురం, యిప్పపువ్వు, చందనం, శ్రీగంధం, దేవదారు, తక్కోలం సుగంధిపాల, పసుపు, మరమంజళ్, జటామాంసి, అతివస, గలిజేరు వేరు, తామర, చెంగల్వకోష్టు, కటుకరోహిణి, చవ్యం, సైంధవలవణం, యేనుగపిప్పళ్లు, ఏలకులు, తాళిసపత్రి, లవంగపత్రి, సంపెంగమొగ్గలుపగకు వరాయెత్తువంతు కూర్చి, ఆవుపాలునమూరి, నెయ్యి పయుడులోవేసి కషాయంస్వరసం అంతాపోసి,దీపాగ్నిన పక్వంగాకాచిదించి వుచ్చుకొనేది. ఈ యోగమున చెప్పిన రోగాలన్నియు మానును.

## —: కల్యాణఘృతము :—

శ్లో. శారిబాద్వయ భూనింబ ఫలినీ చ కళింగకమ్।
త్రిఫలాం చ త్రిజాతంచ విశాలాం దేవదారు చ ॥ 684

ద్విస్థిరే రజనీం కుష్టం ... చణకం తథా।
బృహతీద్వయ మంజిష్టా, హ్యేలవాలక దాడిమమ్ ॥ 685

తాళీసపత్రం తిక్తాం చ విడంగం జాతికట్ఫలమ్।
సదంతి పద్మకం చైవ యష్టీ మలయజం తథా ॥ 686

ఏతాని సమభాగాని పృథక్ పంచ ఫలానిచ।
జలద్రోణే విప క్షవ్యం చతుర్భాగావశేషితమ్ ॥ 687

తత్కషాయం పరిస్రావ్య ఘృతం ప్రస్థద్వయం క్షిపేత్ ।
ఘృతస్య సదృశం క్షీరం చామలక్యారసం తథా ॥ 688

కూష్మాండరస మాదద్యాత్ నారికేళరసం తథా ।
శతావరీ విదారీచైవై లేయేక్షురక స్తథా ॥ 689

ఏతాని సమభాగాని ప్రత్యేకం ప్రస్థమాత్రకమ్ ।
పూర్వద్రవ్యాణి నిక్షిప్య ప్రత్యేకం కర్షసమ్మితమ్ ॥ 690

కల్కీకృత్య సమాలోడ్య శనైర్మృద్వగ్నినా పచేత్ ।
భక్షయేత్ప్రాత రుత్థాయ చతుర్నిష్కప్రమాణతః ॥ 691

ఉన్మాదం చ మతిభ్రంశం శ్వాసం కాసంచ నాశయేత్ ।
హలీమకం పాండురోగం మూత్రకృచ్ఛ్రహరం పరమ్ ॥ 692

శుక్లవృద్ధికరం చైవ మూత్రాఘాతాశ్మరీ హరమ్ ।
క్షయం పాండుం చ శోష్యంచ హ్యస్థిస్రావం చిరజ్వరమ్ ॥ 693

బల్యం వృద్ధికరం చైవ హ్యాయుష్యం పుష్టివర్ధనమ్ ।
వంధ్యానాం గర్భజననం బుధేర్వృద్ధికరం పరమ్ ॥ 694

అపస్మారంప్రమేహంచ సోమరోగంచ నాశయేత్ ।
మహాకళ్యాణకం నామ ఘృతమాత్రేయ భాషితమ్ ॥ 695

—: పీనసరోగాలకు తైలము :—

నీరుల్లిగడ్డలరసం పడి ౧ యెఱ్ఱపత్తియాకురసం పడి ౧ గుంటగలి జేరుఆకురసం పడి ౧ నూనె ప ౧ యివి కలియబోసి పక్వంగాదించి సయు యాన వెలిగారం ప ౧ పేడతోకడిగి పొంగించి పొడిచేసి నూనెదుత్తలో పోసితైలం తలంటుకొనిన పీనసాలు మానును. తెల్లమిరియాలు పలం ౧ పొడిచేసి పడినూనెలోవేసి ౧ శేరు వుమ్మెత్తపూలరసం కూడాపోసి 3 దినాలు సూర్యపుటానబెట్టి తర్వాత ఆరసం ఇగరకాచి తలంటుకొనిన పీనస రోగాలు మానును. శిరోవాయువులున్ను మానును.

### —: శిరోవాయువు పీనసాలకుతైలము :—

తురక వేపకాయల రసం పడి ౧, వేపనూనె పడి ౧, మిరియాలు, దుంపరాష్ట్ర, పసుపు యిదివరకు ౪ వరాలయెత్తు పొడిచేసి పక్వాన కాచి దించి ౧ వరాయెత్తు అభినికూడవేసి ఆ కల్కంతోనే వుంచుకొని తలంటుకొని ౧ ఝాము నానవిచ్చి వేడినీళ్ళలో స్నానంచేసేది. ఈ ప్రకారం రోజుమార్చి స్నానం చేసిన శిరోవాయువులు పీనసాలును మానును.

### —: పీనసాలకు తైలము :—

తమలపాకురసం పడి ౧, నూనె పడి ౧, నిమ్మపండ్లరసం ౪ పడి పచ్చిపసుపుస్వరసం కాలుపడి, పొట్టుతీసినమిరియాలు కాలుపడి, రెండు పళ్లు పాలతోనూరి కలిపికాచేది, కాచు, కరక్కాయవగకు ప ౨ పొడి చేసివేసి పక్వంగాదించేటప్పుడు పిడతలో తైలంవండి వుంచుకొను వొండు విడిచి వొకసారి నీకాయ వేడినీళ్లు చల్లార్చి స్నానంచేసేది. రక్తపీనసాలు ముదరైనవి, ౯ విధాల పీనసాలున్ను మానును.

### —: నస్యము :—

ముల్లంగిగడ్డలరసం దుడ్డుయెత్తు, పచ్చకర్పూరం ౪ రూకలయెత్తు, కూడాకలిపి ముక్కుకు రెండుదినాలు నస్యంచేసిన తీరును. సిద్ధం వాంగ పాది ఆకు (అనగా) చేరుచరప్పుడి ఆకు నలియకొట్టి పొట్లంకట్టి నూనెలో అద్ది రెండుముక్కులు 2 దినాలు నస్యంచేసిన నిలుచును.

### —: గుల్మపుగడ్డలకు, గుల్మానకు, బహుమూత్రానకు :—

కన్యాకుమారిగడ్డ బెంకాయంతముద్ద నూరి బెంకాయంత వెన్న కూడావేసి పిసికి మర్దించి కన్యాకుమారిగడ్డ రెండుబెంకాయలంత ముద్ద నూరి మూసవలెచేసి అందులోముద్దపెట్టి పొదిగి కానరాకుండా పొదిగి మూకుట్లోపెట్టి పైనిమూకుడుమూసి చీలమన్ను చేసి యేరుపిడకలతో పుటంవేసేది. భస్మమవును. ఆ భస్మంతీసుకొన్న మేహరోగాలు, బహుమూత్రాలు, మేహపిటకలు, మహోదరాలు, కరిగి నీరుగా దిగును. ఇది

పరంగివిద్యకు సిద్ధక్రియ. వోమం పలం ౧, ఆవాలు పలం, కానుగపిండిపలం రాతిపుప్పు పలం ౧. వుల్లిగడ్డ పలం౧, యీమందులు సమభాగంగా కూర్చి, బంగారువర్ణంగా వేయించి, జిల్లేడుపళువులకు రసంపోసి, కల్లుపాటకు పలం ౧ కూడాపోసినూరి, చిల్లగింజ ప్రమాణం మాత్రగట్టి వుంచేది, గుల్మానికి కడుపుగడ్డలకు యిచ్చేది, మాత్రనోట్లో వేసి నీళ్లుత్రాగేది.

## —: బహుమూత్రానకు :—

వికసించిన తంగేడుమొగ్గలు వడి తెచ్చి, యెనుముపెరుగు ౨పళ్లు, చిన్నకుండలోపోసి వాశెనకట్టి అపైనిమొగ్గలు పెట్టగా బెట్టి ౧ ఝాము మంటవేసి, ఆమొగ్గలుయెత్తి, మంచినూనె పోసి నూరి, పొన్నకాయంత మాత్రలుచేసి ౨ పూటలు అరమండలం తీసుకొనేది, గుణమౌను.

## —: ఉదరరోగాలకు కళింగాదిలేహ్యము :—

వుచ్చకాయలు ౧౦౦ (ముదురుకాయలు) తెచ్చి బద్దలుతరిగి కోట్లోవేసి ౨ పళ్ళ కల్లుప్పుకూడావేసి తొక్కి ఆముద్ద బట్టలోవేసిపిండి పంచలవణాలు, నవాసారం, యవక్షారం, వెలిగారం, వెల్లుల్లిపాయలు, కటుకరోహిణి, వెంఖాళంపట్ట, జ్యోతిష్మతివిత్తులు, యివి వగకు పలం ౪ వంతు కూర్చి చూర్ణంచేసి, వస్త్రగాళితంచేసి ఆ రసాన ముద్దగానూరి కలిపి వుడకబెట్టి, ముద్దగా లేహ్యపక్వాన వచ్చేటప్పుడు దించుకొనేది. పూటకు గురిగింజంతముద్ద చక్కరలో పొర్లించి యిచ్చేది. ఉదరాలు మొదలైన కడుపులోని రోగాలుమానును. వారి వారి ప్రకృతి తెలిసి యిచ్చేది.

## —: విరేచనమునకు :—

కలబందముట్టలు ౨ గీచి, ఆ గుజ్జు చట్టిలోవేసి, తూమెడు నీళ్ళు పోసి, అళవుపక్కలు పలం ౪ కరక్కాయ పలం ౪ శొంఠి పలం ౪ కొట్టి కూడావేసి, నల్లతుమ్మిఆకు పట్టెడు సంబరేణిఆకు పట్టెడు కూడా వేసి కాచి, నాలుగింట నొకపాలుగా కషాయం దించుకునేది.

అందులో ఆముదం కాచి పోసి మనిషికి తగ్గట్టుగా యిచ్చేది, ఆమాంతం భేది అవును. శోభలు, వావులు, గుల్మాలు అన్నిమానును.

—: కళింగాదిప్రయోగము :—

పుచ్చకాయలు ముదురుపండ్లు ౧౦ నారింజకాయలు తరిగే టట్టు చుట్టలుగా తరిగి పెద్దపడితో పడి కల్లుప్పు కొట్టిఆ చుట్టలోకూరి ఆ కాయలు కుండలోవుంచి, మిగిలిన వుప్పు ఆ కాయలమీదనే చల్లి ఆ కుండకు చీలమన్నిచ్చి యెనుము కట్టివుండే చోట తొడ పొడుగు గుంట త్రవ్వి ఆ కుండను అందుకుంచివుూడ్చి మీదని ఆపంచితము నిలచేటట్టుగా యెనుమునుకట్టేది. ఈ ప్రకారం ఆ కుండనుపూడ్చిన ఆరునెలలైన వెనుక గ్రహించిన ఆకాయలు లెస్సగామారి ముద్దగా లేహ్యంవలె నుండును. ఆ లేహ్యమంతా యెత్తి చాటలోవేసి మోడించివూటకు రెండురూకలయెత్తు అల్లపురసానమూడుదినాల కొకసారివంతు నాలుగు వరసలు యిచ్చి నట్టయితే కడుపులోనిగెడ్డలు, మహోదరాలు, కడుపు వుబ్బడం, అగ్ని మాంద్యం మొదలైన రోగాలు మానును. భేది కావలసినవారికి యీ ప్రకారం వొకవూట యిచ్చినట్లయితే అమాంతం లెస్సగాభేది అవును. కడుపులోవుండే పురుగులుగూడ పడిపోవును. తర్వాత పుల్లనిచారుతో అన్నంతినేది. మలబద్ధజ్వరాలకు యీ క్రమాన యియ్యవచ్చును. బాలు లకు, పెద్దలకు, సకలమైనవారికిన్ని యియ్యవచ్చును. సిద్ధక్రియ.

—: భగందరవ్రణము :—

దుష్టపుసమూలం, వావిలవేళ్ళు, చిత్రమూలం, నల్లేరు యివి చూర్ణంచేసి, ఆ చూర్ణం పూటకు వొకవరాయెత్తు పుల్లని మజ్జిగతో 2 దినాలు తీసేది. భగందరమున్ను గుల్మాలున్ను మానును.

—: ప్రమేహానకు :—

ఇంగిలీకం వ ౧ మైలతుత్థం పలం 3, పటికారం పలం 3 యీ రెండున్ను పొడిచేసి పల్లంగావుండే ప్రమిదలో జిల్లేడుపళువులు ? పరిచి

యీపొడి సగంపరిచి దానిపైని గడ్డవుంచి పైని పొడివేసి పైని పళు
వులు పరిచి ప్రమిదమూసి చీలమన్నుచేసి ౫ పిడకల్లో పుటంవేసి యెత్తి
గడ్డ మీది తురిశి పొయ్యేటట్టు చీలవేసి, పూటకు పాతికయెత్తు ఆవు
నేతితో, పాలమీగడతో, వెన్నతో యివ్వవలెను. ఇచ్ఛాపథ్యం చద్ది
పొగాకుకూడదు. పెరుగు, నెయ్యి నిండాకూర్చుకొనేది, సకలమేహాలు,
మానును, ప్రమేహం మానును. గర్భంలేనివారికి గర్భం కలుగును.

—: భల్లాతకి రసాయనము :—

భల్లాతకిశేరు, త్రికటుకం, త్రిఫల, త్రిజాతకం, దేవదారు, శ్రీగం
ధం, అగరు, యాలకులు, జీలకఱ్ఱ, చతుష్కం ? కోష్టం, అతిమధురం,
అక్రాకారం వోమద్వయం, హరిద్రాద్వయం, జటామాంసి, తాళీశపత్రి,
గంటుభారంగి, కటుకరోహిణి, పిప్పలీమూలం, చిత్రమూలం అశ్వగంధి,
పరంగిపట్ట, కొత్తమిల్లి, ద్రాక్ష, ఖర్జూరం, రాస్నాద్వయం, జాజికాయ,
జాపత్రి, కూరగడ్డలు, తెల్లగలిజేరువేళ్లు, సుగంధిపాల, నేలతాటిగడ్డలు,
వగకు పలం ౧ బెల్లంశే ౩ తేన శే ౧ నెయ్యి శే ౧ ఔషధంచేసేక్రమం
౫ శేర్ల జీడిగింజలు గోమూత్రంలోవేసి యిగరకాచి గింజలుతీసి ముక్క
లుగావొత్తి నాలుగుగా గొత్తి౨౦ శేర్ల నీళ్లు పోసి నాలుగింట వకపాలుగా
కాచిపిసికి వడిచి కట్టుకొని కషాయంలో బెల్లంవేసి పాకుబట్టి అంగడి నుం
డులుచూర్ణంచేసుకొని పాకులోవేసి లేహ్యంగాచేసి నెయ్యి పోసి ధాన్యపు
టానవుంచి దినం పుస్తికాయంత తీసుకొనేది. పథ్యం గురుపదార్థం,
పులుసు, ఆవనూనె వాడరాదు. మేహవాయువులు, శూల కట్టు, మేహ
వాయువులు, అశీతివాయువులు మానును.

—: బిల్వాదిలేహ్యం :—

శ్లో. త్రింశత్పలం బిల్వమూలం పంచవింశత్ కపిత్థకైః ।
తదర్ధం చామలక్యాశ్చ తదర్థం కృష్ణగంబకైః ॥ 696
ద్రాక్షా ఖర్జూర కానాంతు పృథక్ ద్విపలికంతథా ।
ద్విద్రోణే సలిలే క్షిప్త్వా చ తుర్భాగావశేషితమ్ ॥ 697

తత్కషాయం సమాలోడ్య పంచాశత్పలకం గుడమ్ ।
ఆర్ద్రికస్వరసప్రస్థం తదర్ధం మాతులుంగకమ్ ॥ 698

చాతుర్జాతకధాన్యాశ్చ ముస్తా వ్యోష విడంగకైః ।
తాలీసపత్ర కుష్ఠాభ్యాం యష్టి సైంధవ జీరకైః । 699

శాటకోశీర కాశ్మర్యైః కస్తూరీ కుంకుమై స్తథా ।
యేషాం ద్వికర్షచూర్ణం తు కార్పాసాస్థేః పలంతథా ॥ 700

రంభాతోరః పలం చైకం ప్రతిపాకం చ కారయేత్ ।
సుశీతే కుడుబం దద్యాత్త్వేవ......కేనచ ॥ 701

ప్రాతఃకాలేన కర్షంతు సేవయేచ్ఛర్దిరోగజిత్ ।
వాతపైత్యమరోచఘ్న మగ్నిదీప్తికరం పరమ్ ॥ 702

ఉద్గార మూర్ధ్వవాతం చ శ్వాసంకాసం చ గుల్మజిత్ ।
గ్రహిణీపాండురోగఘ్నం కార్శ్యం ధాతుక్షయాపహామ్ ॥ 703

మహాబిల్వకపిత్థాఖ్యం రహస్యం లేహ్య ముత్తమమ్ ।
సర్వపైత్యవికారఘ్న మశ్వినీదేవనిర్మితమ్ ॥ 704

..........................।
ద్వీపి స్నుహీ ఫలత్రింశత్కుట్ట యిత్వాహ్యులుఖలే ॥ 705

చతుర్ద్రోణజలే క్షిప్త్వా సప్తవారేణ దాపయేత్ ।
ఏతేషాం రసం యుక్తం చతుర్భాగావశేషితమ్ ॥ 706

కల్కం ద్వీ పిస్నుహీ భ్యాంతు చతుప్రస్థం ఘృత క్షిపేత్ ।
చిక్కణేసవదం (?) కృత్వా అవతార్య ............ ॥ 707

పునఃపాకేన విధినా గుగ్గులుం పలమష్టకమ్ ।
పునర్ద్వీపస్నుహీ సేవాపలమష్టక ? యోజయేత్ ? ॥ 708

అవతార్య సుపక్వాయ యోజయేత్త్వాస్త ? వల్లభః ।
గ్రంథిరూపాణి సర్వాణి భగంధర విదారికే ॥ 709

సంధి గ్రంథి సమాయుక్తం శుక్లగ్రంథికమేవ చ ।
లింగగ్రంథ్యాది రోగేషు శూలేషు వివిధేషు చ ॥ 710

లింగయోనిగతాన్ దోషాన్ సర్వాణ్యపి వినాశయేత్ ।

—: శిరోరోగానికి నస్యము :—

మిరియాలు తేనె మర్దించి నస్యంచేసిన దోషజ్వరాలు మానును. దుష్టుపాకున్ను, పిప్పలీపొడిన్ని మర్దించి నస్యంచేసిన దోషజ్వరాలు మానును. శాకరాకుపసరులో, వెల్లుల్లి, మిరియాలు, సైంధవలవణం, కలిపి నస్యంచేసిన దోషజ్వరాలు మానును.

—: అశ్వగంధాది ఘృతము :—

పెన్నేరుగడ్డ వీశలు ౩, చిట్టాముట్టి, పేరాముట్టి, కోలపొన్న, ముయ్యాకుపొన్న, పాలవేళ్ళు యిది వగకు వీశ ౧, ౮ తూములు నీళ్ళు పోసి తూమెడుగాకాచి అందులో పాలు తూము పోసి నెయ్యి తూమెడుపోసి కలిపి, గంధం, కలువదుంపలు, అతిమధురం, పిప్పలి, ద్రాక్ష, కసివింద, దేవదారు, మంజిష్ట, తవక్షీరి, పద్మకం, పౌండ్రకం, దూలగొండి, అడ్డసరం, కర్కాటకశృంగి, గంటుభారంగి, కస్తూరిపసుపు, అగరుచక్క, అతివస, వెట్టిబొద్దిఆకు, కురువేరు, వట్టివేళ్ళు, శొంఠి, వీనిని సమంచూర్ణంచేసి, అందులో తేనెకలిపి (నెయ్యిపోసి,) పక్వంగా దించి, నిత్యం అరచేతిగంటెడు తీసుకొనిన శరీరంపుష్టి అవును.

—: అస్తికర్ణాది తైలము :—

బలురాకాశి మూలం, లక్క, పర్పాటకం, నాగరం, వాకుడు, పెన్నేరుగడ్డ, మంచిగంధం, ధుంపరాస్న, కటుకరోహిణి, దేవదారు, కొడిశపాల, రేణుకలు, మ్రానిపసుపు, సదాప, తుంగముస్తెలు, వట్టివేళ్ళు, కస్తూరిపసుపు, కోష్టం, మంజిష్టి, శొంఠి, మజ్జిగ, నులుత్తుం ? పోసి, (బలురాకాశిదుంపలు ౩ వీశలు) తొక్కి మజ్జిగలోకలిపి, కషాయం తూమెడుగాకాచి వడియగట్టి, అందులో నూనె నాలుగుశేర్లుపోసి కల్కం

వగకు ప 3 ప్రకారం అంతా చూర్ణంచేసి తైలంలో కలిపి కరివేపాకు, వేసి మృదుపాక చిక్కనపాకాల వండి దించేది. తలఅంటుకోను పురాణ జ్వరం, క్షయం, పిత్తాలు, శ్వాసకాసాలు, వాయువులు, మేహకాశలు మొదలైన రోగాలు మానును.

—: పాండుశోథ ప్రమేహం మూత్రకృచ్ఛ్రాలకు లేహ్యము :—

నుగునోసాకు పలం ౧ చన్నీళ్ళు నాలుగుతూములుపోసి తూమెడు గాకాచి పిల్లి పెసరువేళ్ళు, నేలగుమ్మిడివేళ్ళు, పల్లేరువేళ్ళు, యీ రసాలు తూమెడుపోసి అష్టభాగంగాకాచి, ద్రాక్ష, అతిమధురం త్రికాతకం, పిప్పలి, ఖర్జూరం, మంచిగంధం, నాగకేసరాలు, ముస్తలు, తామర వేళ్లు, ఉశిరికపప్పు, కలువదుంపలు వగకు ప ౧, తవక్షీరి ప ౪, పంచ దార, తేనె కుంచెడు వీనితో లేహ్యంగాచేసి రెండుపూటలు తీసుకొనేది పైత్యము ఉన్మాదం, తలతిరుగుట, మూర్ఛలు, దేహంమంట, తలనొప్పి, అరకాళ్లు అరచేతులమంట, ప్రమేహం, మూత్రకృచ్ఛ్రం, కామిల, పాండు శోథ మొదలైన రోగాలు మానును

—: భృంగామలక తైలము :—

గుంటగలరాకురసం శేరు ౧, ఉసిరికాయలరసం శే ౧, పొన్నగం టిరసం శే ౧, పాలు శే౧, నూనె శే ౧, శ్రీగంధం, అతిమధురం, కోష్టం, దుంపరాష్ట్రకటుకరోహిణి, వట్టివేళ్లు, వగకు ప౧, చూర్ణంవేసి కలిపి దీపా గ్నిగా కాచి వస్యంచేసేది. శిరోవాయువులు, నేత్రరోగాలు, చెవుడు, కర్ణ శూలలు, పీనసశ్వాసం, తలతిరుగుట, తలవణకుట, పైత్యం, ఆవరణపై త్యం, యివిమానును.

—: కర్ణశూలకు :—

చింతపండు, అల్లం, మాదీఫలం, మహిసాక్షి, జటామాంసి, సర్జరసం, సైంధవలవణం, యిదివగకు ప ౨ కషాయం, నూనెపోసికాచి, చెవులోపోయును, కర్ణశూలలుమానును.

—: ర క్తపైత్త్యానికి :—

వట్టివేళ్లు, గ్రంథితగరం, శొంఠి, తక్కోలం, శ్రీగంధం, చందనం, లవంగం, పిప్పలీమూలం, నాగకేసరం, ముస్తలు, మ లక, కర్పూరం, తవక్షీరి, కృష్ణాగరు, యివిసమంచూర్ణం, సమంశర్కరకూర్చి తినను, ర క్తపైత్త్యాలు మానును.

—: భల్లాతకీరసాయనము :—

జీడిగింజలు ౩౧, రెండుగా పగులగొట్టి పాలు శే ౧, నీళ్లు శే ౩౪ అష్టభాగం మిగులునట్లుగాకాచి, ఏల, లవంగపత్రి, లవంగపట్ట, నాగకేసరములు, శొంఠి, మిరియాలు, తుంగముస్తలు, చిత్రమూలం, జీలకఱ్ఱ కొత్తిమిల్లి, సౌవర్చలవణం, మామిడిగింజలు, పిప్పళ్లు, మారేడు, వగకు సమం యిందుకు మూడుపాళ్లు శర్కరకలిపి, ఆరుపాళ్లు వెలగపండుచూర్ణం చేసికలిపి, ఆచూర్ణం రెండుపూటలు తినిన అతిసారము గ్రహణి, క్షయం, గుల్మం, కాసశ్వాసం, అరోచకం యివిమానును.

—: చూతాదిచూర్ణము :—

మామిడిపప్పు, తుంగముస్తలు, తామరదుంపలు, రేణుకలు, మిరియాలు, జాజికాయ, కలువ దుంపలు, మ్రానిపసుపు, దానిమ్మకాయలు, జీలకఱ్ఱ, పిప్పళ్లు, మునుగుతామర, అగరు, శొంఠి, నేరేడుగింజలు, అతివస, మామిడిచెక్క, మారేడుపండు, కొడిశపాల, సైంధవలవణం, వాోమం, బూరుగబంక, కలువవిత్తులు, వీనినిచూర్ణంచేసి పెద్దచెక్క కషాయముపోసి యెండించి తేనెతోయిచ్చిన సమస్తమైన అతిసారాలు మానును.

—: ఆనందభైరవము :—

గంధకం ప ౧, తాళకం ప ౧, నాభి ప ౩, మనశ్శిల ప ౧, వెలిగారం ప ౭, యింగిలీకం ప ౮, అల్లపురసము, నిమ్మపండ్లరసము, క్రమముగ మూడురోజులు మర్దించి, మినపగింజలంత వటకాలుచేసి, సన్నిపాతి

మూలకు అల్లపురసావ, గ్రహణికి శొంఠి, పిప్పలి కషాయముతోను యిచ్చేది.

—: రామబాణము :—

సముద్రలవణం, సౌవర్చలవణం, సైంధవలవణం, సర్జక్షారం, యవక్షారం, వెలిగారం, వోమం, చిత్రమూలం, కరక్కాయలు, పిప్పళ్లు యింగువ, విడంగములు, గలిజేరువేళ్లు, సమభాగచూర్ణం, భోజనంచేయునప్పుడు అయిదుకళ్లలో రెండువరాయెత్తు, నేతితోపుచ్చుకొనిన అజీర్ణం గుల్మము, విషూచి, కామిల, పాండు, శోఫలు, మొదలైనవి మానును.

—: తాళీశమాత్ర :—

తాళీశపత్రి ప ౧. మిరియాలు ప ౧, పిప్పళ్లు ప ౨, శొంఠి ప ౩, ఎలకులు, లవంగాలు, నాగకేసరాలు, ఆకుపత్రి, వట్టివేళ్లు, వీనిని వగకు పలం ౧, యెత్తు తెచ్చి చూర్ణంచేసి యిందుకు బెల్లం రెండుపాళ్లువేసి పిట్టు పెట్టి వటకాలుచేసి నిత్యం పుచ్చుకొనిన చెప్పిన రోగాలు మానును.

—: కర్ణరోగాలకు :—

శొంఠి, సైంధవలవణం, పిప్పళ్లు, ముస్తలు, కోష్టం, వెల్లుల్లి, సమము గ్రహించి జిల్లేడు ఆకురసంలో నూనెపోసి పక్వముగా కాచి చెవులో పోసిన కర్ణశూలలు, చెవుడు, చీముకారునది మానును.

—: భావనకరక్కాయ :—

కరక్కాయలను కలిలోయెనిమిదినాలు వూరసిచ్చి, ఆకరక్కాయలను పగులకొట్టి, విత్తులుతీసి, నీడనయెండించి, తరువాత మజ్జిగలోమూడు దినాలు వూరనిచ్చి, పిప్పళ్లు ప ౧, మిరియాలు ప ౧, జీలకఱ్ఱ, ప ౧, వోమం ప ౧, జాజికాయ ప ౨, లవంగాలు ప ౨, లవంగపత్రి ప ౨, రాస్న ప ౨, విడంగములు వ ౨, కొత్తిమిల్లి ప ౨, అతిమధురం వ ౨, చెంగల్వకోష్టం వ ౨, పంచలవణాలు వ ౫, చిత్రమూలం, యాలకులు, చవ్యం, నాగకేసరాలు, పద్మకేసరాలు, అగరు, శొంఠి, వగకు ౨ వ

చూర్ణంచేసి అల్లపురసంతో నూరి పూరివకరక్కాయలో ఆచూర్ణంవేసి సీడనయెండబెట్టి నిమ్మపండ్లరసాననూరి వుండలుచేసి రెండుపూటలుతినిన సకలవ్యాధులు మానును,

—: కాళ్లువిచ్చుడాన్కి, పగుళ్లకు :—

మైనం, పత్తిపాలు, జిల్లేడుపాలు, మామిడిపాలు, జీడిగింజలు, యెనమునెయ్యినికలిపి, పుచ్చుకొనిన కాళ్లువిచ్చుడం మానును.

—: విరేచనమునకు :—

కటుకరోహిణి, నేపాళం,యివిసమం సైంధవలవణం,కలబందరసాన మర్దించి గుంజాప్రమాణం, శరీరసత్వమెరిగి యిచ్చిన విరేచనంకల్గును.

శుద్ధిచేసిన వెలిగారం ప ౨, త్రిఫలం మూడువరాయెత్తు, త్రికటుకం 3వరా యెత్తు, నేపాళం ఎ౧౨ వీనిని నిమ్మపండ్లరసాన మర్దించి గురిగింజల ప్రమాణం,

—: వంగశుద్ధి :—

తగరం, సీసం, ఆవునెయ్యి వేసి యేడుమాట్లు కరిగించి వావిలిఆకు స్వరసంలో పోసేది. శుద్ధిఅవును,

—: ధనుర్వాయువుకు :—

జిల్లేడుఆకు, వావిలఆకు, చెంగాదిఆకు, ఉమ్మెత్తఆకు, తక్కాళిఆకు, తెల్లవుప్పిఆకు, పసరులు, మూడుఅడ్డలు, నూనె, ఆముదం మూడు అడ్డలు కాచిదేహానకు పూసిన ధనుర్వాయువులు మానును.

—: అతిసారజ్వరహరము :—

శ్లో. అఫేన విజయంబీజం కాళింగాతివిషాంగనాః ।
నాగరం జీరకంచైవ శాల్మలీపిచ్ఛ జాతకమ్ ॥ 711

కుబేరాక్షం చ బిల్వస్య ఫలమజ్జా తథారథుః ।
మర్దయేద్విజయాకాథ నిష్కార్థం మధు నాలిహేత్ ॥ 712

అతిసారేషుకక్వేషు దేయంతు గ్రహణీగదే ।

టీ. నల్లమందు, గంజాయివిత్తులు, కొడిశపాల. అతివస, తుంగముస్తెలు, శొంఠి, బూరుగబంక, జాజికాయ, గచ్చపప్పు, మారేడుపండుగుజ్జు, పెద్దమానిచక్క, యిది సమాంశాలు గంజాయి ఆకురసానమర్దించి, ౧ వరాయెత్తు తేనెతోయిచ్చేది, అతిసార జ్వరాలు మానును.

—: సన్నిపాతాలకు అనుపానము :—

శ్లో. కటుత్రయం సైంధవం చ నిర్గుండీ శిగ్రుమూలకమ్ ।
అర్కత్వక్చ యవక్షారం కటువృత్తం చ చిత్రకమ్ ॥ 713

ఆర్ద్రకం పిప్పలీమూలం లశునం చ లవంగకమ్ ।
క్వాథం చైషామనూపానం సన్నిపాతజ్వరాపహృత్ ॥ 714

టీ. త్రికటుకం, సైంధవలవణం, వావిలాకు, మునగవేరుచక్క, జిల్లేడువేరు చక్క, యవక్షారం, యెట్టిగొంగు ? చిత్రమూలం, అల్లము, పిప్పలీమూలం, వెల్లుల్లి, లవంగాలు, మరియు పంచకోలాలు, దశమూలాలు, యీ మొదలైనవాని కషాయాలు సన్నిపాతాలకు అనుపానాలు.

—: దాహశాంతికి అనుపానాలు :—

శ్లో. ధాన్యకం జీరకం కేశ్యముశీరం చందనం ఘనమ్ ।
సితాకర్పూరకం కోష్టంమధుకం చ మృణాళకమ్ ॥ 715

పంచత్వక్పల్ల వాశ్చైవధాత్రీఫల రసస్తథా ।
ఏతేషామనుపానేన దాహశాంతి ర్భవేద్ధ్రువమ్ ॥ 716

టీ. కొతిమిల్లి, జీలకఱ్ఱ, కురువేరు, వట్టివేళ్లు, శ్రీగంధం, తుంగముస్తలు, చక్కెర, కర్పూరం, చంగల్వ, కోష్టం, అతిమధురం, తామర తూండ్లు, పంచపల్లవాలు, పంచవల్కలములు, ఉసిరిక కాయలు, యీ అనుపానాలు దాహశాంతి కరములు.

—: ఛర్దియందు అనుపానాలు :—

శ్లో. జాతీ లవంగకం లాజా మధుకం శర్కరా మధు।
హరీతకీ గుడూచీ చ లాజాః కాంజికమేవ చ॥ 717

మాతులుంగం శిగ్రుబీజం బిల్వమూల కరంజకమ్।
ఏతేషాం వాంతి నాశార్థమనుపానం ప్రకల్పితమ్॥ 718

టీ. జాజికాయలు, లవంగాలు, పేలాలు, అతిమధురం చక్కెర, తేనె, కరక్కాయలు, తిప్పతీగె, కలి, మాదీఫలం, మునగ, కానుగ, మారేడువేళ్ళు యివి వాంతిహరమునకు అనుపానాలు.

—: ఎక్కిళ్ళకు అనుపానాలు :—

శ్లో. యష్టీకుశీరసలిలం భస్మ మాయూరపింఛకమ్।
గేహాంభ్రమరికస్య హ్యాశమార్గస్య బీజకమ్॥ 719

హిక్కారోగేఽనుపానార్థం దేయాని ససితామధు॥ 720

టీ. అతిమధురం ఎండ్రకాయ గుంటలోని నీళ్లు, నెమలి రెక్కలమసి, తుమ్మెదగూడు. వుత్తరేణివిత్తులు, చక్కెర, తేనె యివి ఎక్కిళ్ళకు అనుపానాలు.

—: నీరుదిగేందుకు :—

దోసవిత్తులు, మంచి జీలకఱ్ఱ వీనిని మెత్తగానూరి చక్కెరతో యిచ్చిన నీరుదిగును.

—: వాంతి ఆగుటకు :—

వాకుడుపండ్లు 2 నూరి, తేనెతోకలుపుకొని తాగిన వాంతులు మానును. చల్ల వంటకం పథ్యం, పాపటాకాయలరసం, నెయ్యిన్ని, సరిగా కాచి యించుక తాగిన వాంతి అగును. ద్రాంగపండ్లు కలితో నూరి త్రాగిన వాంతి అవును.

—: వాంతి నిలుచుటకు :—

జీలకఱ్ఱ మాడయెత్తునూరి త్రాగిన వాంతి మానును.

—: వాంతి అగుటకు :—

నేలతాటిగడ్డ చూర్ణం, రెండు మాడలయెత్తు, వుత్తరేణిఆకురసాన కలిపిత్రాగిన వాంతి అవును.

—: వాంతిమానుటకు :—

తుమ్మిఆకు నస్యంచేసిన వాంతిమానును.

—: మేహచూర్ణం :—

శ్లో. నాకలీబీజమాదాయ రంభాతోయేన భావయేత్ ।
వుదుంబరస్యార్జునస్య ధాత్ర్యాశ్చ స్వరసేనచ ॥ 721

కుమార్యా గోక్షురస్యైవ గాడూఛ్యాశ్చరసేన చ ।
శతావర్యాశ్చ తోయేన భావయేచ్చ యథాక్రమమ్ ॥ 722

సూర్యతాపే విశోష్యైతత్ శ్లక్ష్ణచూర్ణం తు కారయేత్ ।
మధుమేహం నిహంత్యాశు మూత్రరోగం తథైవచ ॥ 723

అశ్మరీం మూత్రకృచ్ఛ్రం చ సోమరోగం తథైవచ ।
కామిలాం చ ప్రమేహం చ పిత్తం చాపి వినాశయేత్ ॥ 724

—: మేహాలకు ఆముదము :—

దొండాకు, పొన్నగంటిఆకు, సరస్వతిఆకు, చెరుప్పడి, అనెరంగి శీందిలకొడి, ఆరకంపట్టె, అత్తిపట్ట, వగకురసం పడి ౧, జాదికాయ, జాపత్రి, మూచికాయ, కర్కాటకశృంగి, కంబుగపొట్టు, కదళిపువ్వు, చిరునాగపూ, కురాసానివోమం, ఏల వగకు పలం ౪, పాలు పడి ౧, కలకండ పలం ౪, ఆముదం శే ౩, నూనె శే౩, సుపక్వంగా కాచుకొని వూటకు ౨ వరాల ఎత్తు యిచ్చిన మేహప్రమేహం, గ్రంథి మేహాలు

మేహపూరలు, లీటలు, వ్రణాలు, చీము, మేహం, ప్రమేహాలు మానును.

## —: వాయువుకు :—

గోధుమలు పలం ౨, కరుంగురువైవడ్లబియ్యం ప ౨, వుప్పి వేళ్లు చూర్ణం పలం ౨, పేముగడ్డచూర్ణ పలం ౨, పరంగి ప ౨, వోమం ప ౨, జనపవిత్తులు ప ౨, మిరియాలు ప౨, అంతాకూర్చుకొని, చూర్ణం చేసుకొని తిరిగి కల్లి తెచ్చికొట్టి (కడపెడకొట్టి) కుండలోవేసి నీళ్లుపోసి, కషాయంగా ఆకషాయం పోశి చూర్ణంకలిపి, ఆకుండలోను, పిట్టుగా పెట్టి తీసుకొనేది, పిట్టుయెండపెట్టి చూర్ణంచేసుకొని జీడిగింజలు శే ౧, శుద్ధి చేసినది బుట్టబెల్లం శే ౨, ముందర చూర్ణం శేరు ౧, అంతా లేహ్యం చేసుకొని వాతరోగాలకు వుప్పులేనిపథ్యం వుండవచ్చును. ఉప్పువేయించి కూర్చుకోవచ్చును సకలవాయువులు తీరును.

## —: మహాచందనాది తైలము :—

బిల్వవేరు, చిట్టాముట్టివేరు, పేరాముట్టివేరు, శెరుకాంచూరివేరు' నెలక్కుముళంవేరు, నెరింజిల్ వేరు, పెళ్లైచ్చారణవేరు, తూతువళేవేరు, నేలవుశిళకవేరు, వట్టివేరు, వలామిచ్చంవేరు, కోరైక్కిళంగు, తణ్ణీముట్టాక్కిళంగు, నెలప్పనైకెళంగు ముల్లుమెలవంవేరు, శెరుక్కీరెవేరు, విష్ణుక్రాంతం, శందలకొడి, కత్తాళె, నల్లిముల్లి, ముండ్ల వంకాయవేరు ఆవారెసమూలం, ఆతంప్లై వేరు, శెంగుళ నీరుక్కిళంగు, అముక్రాక్కిళంగు, నన్నారివేరు, నెబ్బిటెపూండు, శురుక్కారెవేరు, పొన్నగంటి, ముసిముసిక్కి, దొండాకు, బ్రాహ్మిపురియారె, నెరింజవేరు, వెళనీరు, గుంటగెలిజేరు, పాలు శే ౬, నిమ్మపండ్లు ౫౦, నాత్తంపలం ౨౦, అంతు ౧ టికి శేరు నూనె శే౧౬, కలిపి, అతిమధురం, కోష్టం, జీరకం పెద్ద జీలకట్టి, వాయువిడంగం, మిరియాలు, కస్తూరి, కొత్తమిల్లి, పసుపు, కున్నివంగపట్టై, తాళిశపత్రి, శొడామంజి, తగరం, శెరునాగప్పూ, దేవదారు, నాగణ , శంబకిమొట్టు, పులాంకిలంగు, సాంబ్రాణి, వోమం

కిళువోగంపట్టె, పూంచాతిపట్టె, ముద్రించపలం, శాతిక్కాయి, లవంగము, ఏలం, జాజిపత్రి, అతివిడయం, కటుకరోహిణి, మంజిష్ట సిత్తరత్తై, మ్రానుపసుపు, వగకు ప ౧ పచ్చకర్పూరం, కుంకుమపువ్వు, గోరోచనం, పునుగుశట్టం, వగకు ప ౧.

—:మేహవాయువులకు తైలము :—

*కుతిరవాలికొడి, కంగంవేరు. పెరప్పంకెళంగు, యెరుక్కంవేరు, వేప్పంపట్టె. శారజవేరు, శిత్తామట్టివేరు, కంగత్తారిపట్టె, కడబ్బివేరు, కొట్టివేరు, వెల్లరుక్కవేరు, సమూలం వగకుపలం ౧౦, నీళ్లుతూములు నాలుగుపోసి నాలుగోవంతుమిగులు పాలుకాచి కషాయంకుండలోపోసేది, గుంటగలిజేరు ఆకురసం, చెరుప్పడి, తలుతాళే మొడక్కత్తాన్ పడి ౧, పుత్తామణి పడి ౧, కుప్పంటాకురసం పడి ౧, మేకపంచితం పడి ౩, పాలు పడి ౩, గోమూత్రం పడి ౩, పాలు పడి ౩, చతిరకల్లి పాలు పడి ౨, తిరుకకల్లి పాలు పడి ౨, తిల్లంపాలు పడి ౨, కషాయములోపోసేది. వేపనూనె శే ౨, ఆంకాయనూనె శే ౨, కల్కం, తాళీసపత్రి, వస, వలంబిరికాయ, మ్రానుపసుపు, వాయువిడంగం, కస్తూరిపసుపు, సాంబ్రాణి, విళామిచ్చంవేరు, కర్కాటకశృంగి, కంబుగమొట్టు, అరత్తై, హరేణుకం, కవల్లికొళి, చవ్యం, దేవతారం, వట్టివేరు, అతిమధురం, కోష్టం, అక్రాకారం, శాతిక్కాయి, క్రాంబు, ఏలం, కతకుప్పె, మిళగు, కరకం, పెరుంజీరకం, కారుముగ అరిసి, జంగాలపచ్చె, వగకు పలం ౧, అన్ని నిమ్మపండ్ల రసముతోనూరి, ఇయ్యవలెను. సైంధవలణము, పెట్లుప్పు, చవుకారం వగకు ప౧, పొడిచేసియ్యవలెను. కల్కంతోకూడా కూర్చి పక్వముగాతైలము తయారుగావించి వడియకట్టి దించేది. సాంబ్రాణిహారతి కర్పూరం, పచ్చకర్పూరం, పొడిచేసికల్పి ధాన్యపుటాన ౧౫ దినాలువుంచి పూటకు వరా ౧ యిచ్చేది. శరీరమునకు లేపనముచేయునది వాయువులు మానును పథ్యంగావుండవలెను. పాలు నెయ్యి కూర్చుకొనేది.

---

* ఔషధుల పేర్లు చాలవరకు అరవభాషలో నున్నవి.

—: చింతామణిమాత్ర :—

శ్లో. రసం వజ్రం హేమతారం తామ్రం తీక్ష్ణాభ్రకంమతమ్ ।
గంధకం మౌక్తికం శంఖం ప్రవాళం చ మనశ్శిలా ॥ 725

శోధితం చ సమం సర్వం సప్తాహం భావయేద్దృఢమ్ ।
చిత్రమూలకషాయేణ భావనాచైక వింశతిః ॥ 726

నిర్గుండీ సూరణద్రావైః భానుదుగ్ధే దినత్రయమ్ ।
అనేన పూరయేత్సమ్యక్పీతవర్ణవరాటకాః ॥ 727

టంకణం రవిదుగ్ధేన పిష్ట్వా తాసాంముఖే లిపేత్ ।
రుద్ధ్వాభాండముఖేపశ్చాత్సాంగశీతం విచూర్ణయేత్ ॥ 728

జంబీరైర్మాతులుంగామ్లైస్సప్తవారం విభావయేత్ ।
సూక్ష్మచూర్ణం తతః కృత్వా చూర్ణపాదాంశ టంకణమ్ ॥ 729

టంకణాంశం వత్సనాభం తత్సమం మరిచం క్షిపేత్ ।
లవంగం నాగరం పథ్యా కణా జాతీఫలం పృథక్ ॥ 730

ప్రత్యేకం వత్సనాభస్యపాదాంశం చూర్ణితం క్షిపేత్ ।
మాతులుంగద్రవైస్సర్వం సర్వమేతచ్చ లోడయేత్ ॥ 731

చతుర్గుంజామితంఖాదేత్ కణాక్షౌద్రం లిహేదను ।
క్షౌద్రం వనార్ద్రకద్రావైః శుంఠీపథ్యా రసేనవా ॥ 732

అనుపానవిశేషేణ సర్వరోగప్రశాంతయే ।
వహ్నిం వివర్ధయేత్సమ్యక్ బలం చ కురుతే నృణామ్ ॥ 733

వీర్యం వర్ధయతే విషం చ హరతే దార్ఢ్యం విధత్తే తనోః ।
అభ్యాసేన నిహంతి మృత్యుఫలితం పుష్టింప్రదత్తే నృణామ్ ।
శ్వాసం కృంతయతే క్షయం క్షపయతే కాసం చ నిష్కాసయేత్ ॥ 734

వాతాన్విద్రధి శూల పాండు గ్రహణీ రక్తాతిసారాన్జయేత్ ।
మేహ ప్లీహ జలోదరాశ్మరీ రుజాం శోఫం చ గుల్మం జయేత్ ॥ 735

ఏతాన్కృచ్ఛ్రభగంధరజ్వా గదానర్శాంసికృచ్ఛ్రాన్వితాః ।
సాధ్యాసాధ్యరుజానిహంతి సహసా త్రైలోక్య చింతామణిః ॥ 786

వ్యా. రసం వజ్రం హేమతారం తామ్రం తీక్ష్ణాభ్రకం చేతి సర్వం మృతమితి. నరసాది సప్తద్రవ్యాణి మృతాన్యేవ యోజయేది త్యర్థః. గంధకం మౌక్తికం శంఖం ప్రవాళం తాళకం శిలా చేతిగం ధాదిషట్కం, శోధితమిత్యనేన తత్తత్ప్రకరణోదిత ద్రవ్యైః శోధిత మిత్యర్థః సర్వం సమాంశాని కృత్వా చిత్రమూలకషాయేణేతి కేచిత్ ద్రవ్యాచ్చతుర్గుణం జలం దత్వా అష్టావశేషిత మిత్యాగమసిద్ధేన చిత్రమూల కషాయేణ సప్తాహంమర్దయేదితి నిర్గుండీరసేన సప్తదినం నిరంతరం మర్దయేత్ తథైవసూరణ కంద స్వరసే నాపి సప్తవారం మర్దయేత్ దృఢశబ్దేన శంఖప్రవాళాది కఠినద్రవ్యాణాం ద్రవత్వ ప్రాప్తి పర్యంతం మర్దయేదిత్యర్థః. భానుదుగ్ధేన అర్కక్షీరేణదిన త్రయం త్రిదినాని మర్దయేత్. తతః సర్వమౌషధంవిశోష్య చూర్ణం కుర్యాత్. పీతవర్ణవరాటికాః అనేనమర్దితౌషధేన సమ్యక్పుకళలత్వేవ పూరయేన్నిక్షిపేత్ పీతవర్ణవరాటికా ఇత్యత్ర, కథంచోక్తం, పీతా లాగ్రంథిలా, పృష్ఠేదీర్ఘవృత్త వరాటికాః, సార్థనిష్క భరాశ్రేష్ఠాః నిష్కభారాచ మధ్యమా, పాదోననిష్క భారాచ కనిష్ఠాపరికీర్తితా ఇతి శాస్త్రసిద్ధ వరాటికానా మంతః సమ్యక్పూరయేత్ రవిదుగ్ధేన టంకణం పిష్ట్వా అర్కక్షీర పేషిత టంకణ పిష్టేన తాసాం వరాటికా నాం ముఖంముఖరంధ్రాన్పూరయేత్. ఆచ్ఛాదయేత్ భాండపరిమిత మృణ్మయపాత్రే తాః క్రమేణ ప్రస్తార్య భాండముఖంరుద్ధ్వా వస్త్ర మృత్తిక యా దృఢం సంధిబంధం విధాయ పచేత్ రుద్ధ్వా. పుటలక్షణ మహాతథాచోక్తం అనుక్తపుటమానేతు ప్రమాణంచౌషధస్యచ వనో పలానాం స్థౌల్యంచదృష్ట్వా కుర్యాత్ పుటంబుధైః ఇత్యాదిశాస్త్ర జ్ఞా నేనపుటంకుర్యాత్ సాంగశైత్యం, సాంగశీతలం కృత్వా విచూర్ణం కా రయేదిత్యర్థః తథాచగ్రంథః యదుక్తం రసయోగేషు వరాట్యంతస్థిత

రసంపుటం కుర్యాద్భిషక్ తం చ వరాటీభిశ్చయోజయేత్ *ఇత్యాది జ్ఞాత్వా చూర్ణం తుల్యం చూర్ణసమానం మృతసూతం మృతసూత యోగేనభస్మీకృత సూతం యోజయేత్ సూతపాదం సూతే చతుర్థాంశం వైక్రాంతం నిక్షిప్యయథా విధి విచూర్ణయేత్. వైక్రాంతసూత పాదిక మిత్యేకద్వాక్య పఠనాద్వైక్రాంతం మృతసూతచతుర్థాంశమేవ నతుపూర్వరసస్యేతి. నను కథం పుటానంతరయోజ్యౌషధ ప్రమాణం తత్ర తత్పాదాంశం తత్సమమిత్యాది క్రమాలంకారః ఏతత్ శిగ్రుమూలద్రవైః సప్తాహంభావయేత్ చిత్రమూలకషాయేణ ఏకవింశతిభావనాం కుర్యాత్ ఆర్ద్రికస్యరసేనస ప్తభావనాః కుర్యాత్ ఆర్ద్రికరసైః విజయారసైశ్చ భావనాత్రయం కుర్యాత్* జంబీరైః జంబీరనీరైః మాతులుంగరసైశ్చాప్యేతత్ప్రత్యేకతః స ప్త వా రం విభావయేత్ తతోనంతరం సూక్ష్మచూర్ణం కృత్వా పాదాంశం చూర్ణాచ్చతుర్థాంశం టంకణ టంకణ సమం వత్సనాభం వత్సనాభ సమం మరిచం చ నిక్షేపేత్ లవంగం లవంగపత్రం లవంగత్వక్ నాగరం పథ్యాచేతిప్రత్యేకతో వత్సనాభస్య చతుర్థాంశం తస్మిన్ మేళయేత్ సమావృత్తా ఘనా స్నిగ్ధా గుర్వీమజ్జతి చాప్సుచ కర్షప్రమాణా సాశ్రేష్ఠా పథ్యా స్యాద్గుణవత్తరా ఇత్యాది శాస్త్రప్రసిద్ధ. హరీతకీం గృహ్ణీయాత్ తతో భావనానంతరం సూక్ష్మచూర్ణం కుర్యాత్ తదౌషధం చతుర్గుంజామితం కణాక్షౌద్రేస్సహలిహేత్.

—: రసభూపతిః —

శ్లో. తుల్యౌ పారద గంధకౌ మధుకరం తుర్యాంశ తుల్యం తయోః ।
ఖల్వే హంసపదీరసైర్దినయుగం సమ్మర్దయేత్తద్ద్రవమ్ ॥ 787

కృత్వా కాచ ఘటేవటీ కృతవతీ శీతాంశు శుల్వేన తత్ ।
బధ్వాస్యం చ సమం తతోంగులిమితం శ్వేతం మృదావేష్టితం ॥ 788

* ఇచటనుండి * ఇంతవరకు మూల శ్లోకములేదు.

భాండేనాలుకయా త్రిభాగ భరితే క్షిప్త్వా క్షిపేద్వాలుకామ్ ।
భాండాస్యం చ నిరుధ్య వాసరయుగం గాఢాగ్నిముద్దీపయేత్ ॥ 739

ఉత్తార్య స్వశరీరశీతలమతో వేదాంశ తుల్యామృతమ్ ।
తుల్యత్వేవమరీ చ చూర్ణ నికరై స్సంయోజ్యగుంజామృతమ్ ॥ 740

దేయం నాగలతాదళార్ధ సహితం సేవేత్ సదా భాండవాన్ ।
శ్రీమానగ్నికుమారకో రసవరో నిశ్శేషరోగాపహః ॥ 741

శ్వాస కాస కఫ పాండు కామిలాం శూల గుల్మ వమిరోగసంకులామ్ ।
సన్నిపాతమతిదారుణజ్వరాన్ హంతి హంతి రసభూపతిఃక్షణాత్ ॥ 742

వ్యా. తుల్యావితి పాతనాదిత్రయ శోధిత రసస్య భాగికః ప్రయోక్తవ్యః. దుగ్ధేన శోధితస్య ఆమ్లసారాఖ్య గంధకస్యభాగః రసేనసమః ప్రయోక్తవ్యః మధుగరమితి అత్ర మధుశబ్దేన స్వర్ణమాక్షిక ముచ్యతే తత్కథం 'మార్తాండం మధు ధాతుశ్చ శిఖరీ హేమ మాక్షికమితి' రసవైశేషిక నిఘంటువచనాత్. గరశబ్దేన వత్సనాభస్య వివక్షితతయా చ మధుగరయోర్భాగః పారద గంధయోః తుర్యాంశ తుల్యం తయోః చతుర్థాంశ సమభాగత్వేన ప్రయోక్తవ్య మితి కేషాంచిన్మతం. తన్నసంఘటతే మధుగరశబ్దేనవత్సనాభ మాత్రస్య వివక్షితత్వాత్. "గరళోగ్రం శల్యనాభం మధురం చామృతం విషం ఉగ్రం మహౌషధంప్రోక్తం మధుర్మధుగరం స్మృతి"మితి రసవైశేషిక నిఘంటువచనాత్" మాక్షికస్య బహుశః పండితైః ప్రయుక్తత్వాత్ వత్సనాభ ఏక ఏవోపయుజ్యతే వైద్యైః వత్సనాభ స్వరస గంధకయోః తుర్యాంశం పాద భాగయుక్తం తత్సమమిత్యర్థః సమభాగః ప్రయోక్తవ్యః అత్ర కీదృశోవత్సనాభః ప్రయోక్తవ్యః ఇత్యుక్తే, తల్లక్షణముచ్యతే మారణౌ కృష్ణవర్ణం స్యాద్రక్తస్తు రసమర్దనే పీతవర్ణం క్షుద్రకార్యేశ్వేత వర్ణం రసాయనే (రసవిశేష

నిఘంటుః) అత్ర మారణస్య ప్రకృతత్వేన కృష్ణవర్ణం వత్సనాభం ప్రయోక్తవ్యం. అతః పారద గంధక మధుగరాణి త్రీణ్యేవఖల్వే వినిక్షిప్య సమూలం హంసపాది రసేన దినద్వయం మర్దయేత్ హంసపాది రసస్య ప్రమాణముచ్యతే " ద్రవేణద్రవ తాద్రవ్యంపంకీభూతాత్వ ద్రవతాం వ్రజేత్ తావత్ప్రమాణం నిర్దిష్టం భిషగ్భిర్భావనావిధౌ " ఇతి తావన్మాత్రేణైవ భావనా మర్దనం కుర్యాదిత్యర్థః అత్యంత పేషణంన కర్తవ్య మిత్యర్థః తదౌషధం శీతాంశు శుల్బేన సమభాగేన నేపాళాఖ్య తామ్రస్యభస్మనా మిళితం కృత్వా వటీకృత్య గుంజా మాత్రం గుటికారూపం విధాయఛాయా శోషణం కృత్వాకాచఘటా కాచపాత్రే త్రిభాగపర్యంతం పూర్ణస్య పాద మాత్రావశేషితం యథాతథా పూరయేదిత్యర్థః శీతాంశుశుల్బేనరస సమభాగేన నేపాళాఖ్య తామ్రభస్మనా అత్ర కేచిత్ రసభాగం తామ్రశకలం చ కాచపాత్రే ఔషధగుళికాభిస్సహ నిక్షేప్యాణీతి వదంతి తన్నసంగచ్ఛతి. గుళికాభిః అమారితతామ్ర శకలసంయోగ మాత్రేణ నిర్వీర్యత్వాత్ ఉక్తప్రకారేణ తామ్రభస్మ సంయోగేన అధికగుణత్వాత్ భస్మేనైవ భవితవ్యం తథైవబహు ప్రయోగాశ్చ అస్య బధ్వా కాచపాత్రం గుళికారూపం విధాయ ముఖం పిధాయ తతఃపరంసమం తతః పరిమితః అంగుళిమితోచ్ఛేదం అంగుళికా ప్రమాణంమృదా మృత్తికయా ఆవేష్ట్య ఆచ్ఛాదనం కీదృశమిత్యుక్తే తల్లక్షణముచ్యతే " త్రిభాగవాలుకా యుక్తా మృత్స్నా శ్వేతాకాణాసితా సంధిబంధన కర్మసు శ్రేష్ఠ మధ్యాధమక్రమాత్ " తస్మాత్ శ్వేత మృత్తికయా కాచపాత్రస్య ఆచ్ఛాదనం కర్తవ్యమిత్యర్థః త్రిపాదమాత్రం వాలుకయా సంపూర్య కాచకూపీం నిక్షిప్య తదుపరి అవశిష్టంపాదాంశంపునఃవాలుకాభిః పూరయిత్వా భాండముఖం శరావేణ పిధాయ సంధిబంధనం కృత్వా ఇతి. ఔషధస్య వాలుకాప్రమాణమాహ "పంచాశద్బిల్వ సికతాపూరితే చ ఘటాంతరే రసాదిముష్టిం విపచేత్."

—: వాలుకామానముచ్యతే :—

ఏవంసికతాధిక్యేన ఔషధాధిక్యమూహ్యం అత్రభాండకీదృశ మిత్యుక్తే తల్లక్షణముచ్యతే భాండే వితస్తిగంభీరే వాలుకా సుప్రతిష్ట వచనేన ద్వాదశాంగుళ పరిమిత కలశమేవాత్ర వివక్షితమ్. ద్వాదశాం గుళస్య లక్షణం యావన్మాత్ర మూషాధం క్రియతే తావన్మాత్రోచిత వాలుకా పూర్ణేన యోగ్యకలశో వివక్షితః.

—: అత్ర రససూత్రస్థానే వాలుకా లక్షణముచ్యతే :—

శ్లో. శ్వేతరక్తా చ కృష్ణా చ వాలుకా సాప్రకీర్తితా ।
ఆద్యా శ్రేష్ఠా భవేద్రక్తా మధ్యమా ...... వరా ॥ 743

సరిత్సరోహ్రదాదిభవాం చోత్తమం మధ్యమా ధమమ్ ।
శాలితండులవత్ స్థూలాంసికతాం సహపాచనే ॥ 744

ఇతి పూర్వోక్త లక్షణయుక్తా వాలుకాపూర్ణభాండే వాసర యుగం దినద్వయం అహోరాత్రం గాఢాగ్నినాచోద్దీపయేత్.

—: గాఢాగ్ని లక్షణమాహ :—

శ్లో. త్రిశమి ద్దీపికావహ్నిః చతుర్థంకమలాగ్నినా ।
పంచమం గాఢమిత్యేవమేతద్ వహ్నిత్రయం స్మృతమ్ । 745
ఇతిరసాదికవచనాత్ పంచసమిదగ్నినా ॥ 746
సమిల్లక్షణమాహ ఆర్ద్రత్వక్కంటదష్టాదీన్ వల్లీంశ్చవివర్జయేత్ ।

ఆర్ద్రత్వగ్వల్లీ క్షతరహిత శమిల్లక్షణాని ప్రవక్ష్యే ।
స్థౌల్యం ప్రకోష్ఠ ప్రమితం (?) మానతోऽరత్నిమాత్రమ్ ॥ 747

ఏతత్రోప్తం రసానాం ముసలపరిమితమ్ ।
స్నేహావేపాదిపాకె తస్మాత్కారిన్య యుక్తాఖదిరతరు
..............ముఖాః దారుమాత్రం చ యుంజ్యాత్ ॥ 748

శ్లో. ఉత్తమంకాష్ట మిత్యేతత్ఖదిరాసనసంభవమ్ ।
అథవా సురవృక్షస్య వితస్తిద్వయ దీర్ఘకమ్ ॥ 749

స్థాల్యంప్రకోష్టమాత్రం తుశ్రేష్ఠం సూతేంద్రపాచనే ।

ఇతి లక్షణవచనాత్ ఖదిరాసన సంభవ సురవృక్ష సంభవాః ప్రకోష్టమాత్ర పరిమాణాః వితస్తద్వయ దీర్ఘాః వాసరయుగం, గాఢాగ్నింసముద్దీపయేదిత్యత్ర ఔషధప్రమాణస్య ఏకపలమాత్రామితస్యదివసద్వయ వచనే అతిపాకదోషేణ నిర్వీర్యఃస్యాత్, అనేనపలమానస్య ఔషధస్యదివసద్వయ వచనే అపక్వతయా నిర్వీర్యం స్యాత్ తస్మాన్మంథంవ్యవస్థారహితత్వేన దివసద్వయవచనం నసంఘట్టతే ఇత్యాశంక్య పరిహరతి.

శ్లో. సర్వేషు రసయోగేషు పాకకాలమిహోచ్యతే ।
పలస్యయామమాత్రంతు పాకఃస్యాద్భిషజాంమతమ్ ॥ 750

ఇతి రసార్ణవవచనేన రసగంధకాది సర్వద్రవ్య యుక్తస్య ఔషధస్య ఏకపలమాత్రా పరిమితస్య ఏకయామమలమితి కాల మాత్రా వివక్షితేతి భావః. తదేవరసయోగేషు పూర్వోచరితత్వాత్ తేనవత్సనాభసామ్యం మరీచచూర్ణా మితిభావః.

—: అత్రసమ్మతమాహ :—

శ్లో. చూర్ణే స్నేహాముఖప్రయోగ పరిత ద్రవ్యేష్వనేకేషుచ ।
ద్విత్రిప్రస్థ పలాదిమాన విషయే ప్రోక్తేషు తేష్వంతరా । 751
తేత్రా (?) దర్శిత మానమేకమథవా తుల్యాస్తలే సంభవేత్ ।
తత్పూర్వామథ తుల్యతాస్యవిహితా సర్వస్యకా స్సవా ? ॥ 752

ఇతి కల్పభాషణేస్యార్థః......ముఖప్రయోగపరిత ద్రవ్యేషు చూర్ణ, తైల, ఘృత, లేహ్య, రస, గంధకాది ప్రయోగక్రమో

క్తేషు ఔషధేషు అనేకేషు ద్విప్రస్థ త్రిప్రస్థ ఏకప్రస్థ పలాదిమాన విషయేషు ఆర్ద్రీ మేవౌషధం ద్విప్రస్థప్రమాణం ఏవంత్రిప్రస్థ ప్రమాణం ఏకం పలప్రమాణం కర్ణమానమిత్యేవమాదిప్రమాణ విషయేషు అను క్తేషు క్రమ పరితోక్త చూర్ణాదిషులేహ్యే చ ఏకస్యద్రవ్యస్యమానం అను క్తమితిచేత్ పూర్వద్రవ్యస్య సమం దేయమిత్యుక్తమ్ సన్నిహితత్వేన స్వపూర్వోపరిస్థితస్య ద్రవ్యస్య అను క్త ప్రమాణద్రవ్యస్య తుల్యతాసమభాగతా భవతీత్యర్థః కైశ్చిత్ శేత మరిచశబ్దేన శిగ్రుబీజం వివక్షితం తదేవప్రయోక్తవ్య మితి కేచిత్ ఆకరగ్రంధ సంప్రదాయేన మరిచ చూర్ణస్యైవ బహుప్రయోగ దృష్టత్వాత్ మరీచ చూర్ణమేవా త్ర వివక్షితమిత్యర్థః ఏతత్పూర్వోక్త మౌషధం వత్సనాభ మరిచ చూర్ణాఖ్యం సహమర్దయిత్వాగుంజామాత్ర గుళికాః కృత్వా నాగవల్లీ రసాదినా త త్తద్రోగ గుణానుపానేన చ తదౌషధం దేయమ్ రోగాణాం క్షయధ్వాదీనాంశమం కుర్యాత్ ఆరోగ్యం భవతి.

## —: పూర్ణచంద్రోదయము :—

శ్లో. పలంమృదు స్వర్ణదళం రసేంద్రం పలాష్టకం షోడశగంధకస్య ।
శోణైస్సుకార్పాసభవ ప్రసూనై స్సర్వం విమర్ద్యాథకుమారికాద్భిః ॥

తత్కాచకుంభేనిహితం విగాఢే మృత్పర్వటీభిర్దివసత్రయంచ ।
పచేత్క్రమాగ్నౌ సికతాఖ్యయంత్రే తతోరజః పల్లవరాగరమ్యమ్॥754

సౌవర్ణమేతత్సకలామయఘ్నం సర్వేషు యోగేషుచ...... ।
నిగృహ్యచైతచ్చ పలంపలంచ చత్వారికర్పూరరజ స్తథైవ ॥ 755

జాతీఫలం చోషణ మింద్రపుష్పం కస్తూరికా ఇహశాణమేకమ్ ।
చంద్రోదయోఽయం కథితోఽస్య మాషోభుక్తోఽహి వల్లీదళమధ్యవర్తీ ॥

మదోత్కటానాం ప్రమదాశతానాం గర్వాధికత్వం శ్లథయత్యకాండే।
సృతం ఘనీభూతమతీవ దుగ్ధం మృదూని మాంసాని సముండకాని॥757

నవాన్న పిష్టాని భవంతిపథ్యా న్యానందదాయి న్యపరాణిచాత్ర।
వలీపలితనాశనః తనుభృతాం వయస్థ్సంభవస్సమ స్తగద ఖండనః
ప్రబలరోగ పంచాననః ॥ 758

గృహేపి గుహాభూపతిర్భవతి యస్యచంద్రోదయః
సపంచశరదర్పితో మృగదృశాం భవేద్వల్లభః ॥

రతికాలే రతాంతేవా సేవితవ్యోరసో త్తమః।
మానహానిం కరోత్యేవ ప్రమదానాం సునిశ్చితమ్।
కృత్రిమం స్థావరం చైవం జంగమం చాపి యద్విషమ్।
నవికారాయ భవతి సాధకేంద్రస్య వత్సరాత్ ॥ 759

యథా మృత్యుంజయాభ్యాసాన్మృత్యుం జయతి దేహినామ్।
తథాయం సాధకేంద్రస్య జరా మరణ నాశనః।
ఇంద్రపుష్పం లవంగంస్యాత్కార్పాస కుసుమ ద్రవమ్।
తంత్రాంతరే ప్రసిద్ధోయం మకరధ్వజ నామతః ॥ 760

—: యోగాంతరము :—

శ్లో. వర్ణోత్తమస్య స్వర్ణస్య పత్రాణిచమృదూనిచ।
రసో గంధకమాద్భాగా (?) కల్పనేకాష్ఠషోడశా ।? 761

భాగానాం పంచ వింశానాం మేళనం చాత్ర కథ్యతే।
ఆదౌ సహస్వర్ణపత్రైర్మర్దయిత్వా రసం దృఢమ్ ॥ 762

పౌనఃపున్యేన లిప్తాయాంసుశుభాయాం సమంతతః।
కాచకుప్యాం మహాత్యాంచ............ ॥ 763

లేనసంయుతాయాం చ నిక్షిపేత్సర్వ మౌషధమ్।
లేఖ పాషాణ ఖండేన తత్కాచ పటకేనవా ॥ 764

తత్కూపికాముఖం రుధ్వా సమ్యక్స్ఫటిక మృత్కయా।
విష్వక్సేనం హరిం శాస్త్రం పూజయేద్విఘ్న శాంతయే ॥ 765

త్రిదినంవాలుకాయంత్రే క్రమాత్తద్వృద్ధవహ్నినా ।
విపాచ్య దినమేకం తు తూష్ణీం కృత్వా బలిక్రియామ్ ॥ 766

కృత్వా కూపీం సుశీతాం చ గృహ్ణీయా దౌషధం శుభమ్ ।
పూర్ణచంద్రోదయాఖ్యంహి రసం సంగృహ్యా యత్నతః ॥ 767

లవంగ కర్పూరక మాగధీనాం జాతీఫలైః సహమాషమాత్రమ్ ।
కస్తూరికాయా ఇహ శాణయుక్తంగుంజాప్రమాణేనసచూర్ణితేన॥768

నేవేత తాంబూలదళాంతరస్థం సాయంతనే కాల ఇదం ప్రశస్తమ్ ।
శాల్యన్నభుక్ పయసా ఘృతేన స్వాదూని భక్ష్యాని లఘూనిచాత్ర ॥

గోధూమ మోదప్రభృతీని పథ్యంశీతాంబు కాశ్మీరసుగంధిసారాః ।
విసర్జయేత్సర్షపతైల శుష్క శాకామ్ల ముష్ణం కటుమాంసభేదాన్ ॥

మృష్టాన్న పానాది పదార్థ సేవా తీవ్రాధ్వ యానవ్యసనానిచైవ ।
రతిప్రసంగే విగతశ్రమస్స్యాదత్యంత సంతుష్టమనా ప్రగల్భః ॥ 771

మదోన్నతానాం ప్రమదాశతానాం దర్పంచ లజ్జాం లభతే హితాశీ ।
వలీరుజః సర్వముపైతిచాయుః సంవత్సరం తస్యరసస్య సేవా ।
ఇతీరితం సర్వరసాగ్రగణ్యం లోకోపకారాయ మహేశ్వరేణ ॥ 772

—: రాజమృగాంకమ్ (క్షయమృగాంకరసము) :—

శ్లో. రసభస్మ త్రయోభాగాః భాగైకం హేమ భస్మకమ్ ।
మృతతామ్రస్యభాగైకం శిలా గంధక తాళకమ్ ॥ 773

ప్రత్యేకం చ ద్విత్రిభాగం న్యాదేకీకృత్య విచూర్ణయేత్ ।
వరాటం పూరయేత్తేన హ్యజాక్షీరేణ టంకణమ్ ॥ 774

పిష్ట్వా తేన ముఖం రుద్ధ్వా మృద్భాండే తన్నిరోధయేత్ ।
శుష్కే గజపుటేపాచ్యం సాంగశీతల ముద్ధరేత్ ॥ 775

రసోరాజమృగాంకోయం చతుర్గుంజః క్షయాపహః ।
దశపిప్పలికాః క్షౌద్రే మరీచైకోనవింశతిః ॥ 776

సఘృతే దాపయేత్ పథ్యం రాజయక్ష్మ ప్రశాంతయే ।

టీ. రసభస్మం ప. ౩, స్వర్ణభస్మం ప. ౧, వెండిభస్మం ప. ౧, ముత్యాల భస్మం ప. ౧, మనశ్శిల ప. ౧, గంధకం ప. ౧, తాళకం ప. ౧ అన్నియు కల్వములోవేసి కలియనూరి గవ్వలలో వుంచి ఆ గవ్వల వెలిగారమును మేకపాలలోనూరి ముద్దచే సీలుచేసి యెండబెట్టి ఒక కుండలో పోసి నాలుగు వేళ్ల పొడుగు ఉప్పువేసి అందుమీద యీ గవ్వలువుంచి పైన వుప్పునుంచి కుండమూతిని శరావముచే మూసి చీలమన్ను జేసి గజపుటం వేయవలెను. సాంగశీతలమైన పిమ్మట తీసుకొని ఆగవ్వలుకూడా నూరి పొడిచేసి కరాటములోకి వుంచి క్షయమునకు పది పిప్పళ్లున్ను పందొమ్మిది మిరియాలున్ను గ్రహించి అందులో నాలుగు, గురిగింజలయెత్తు ఔషధం కూర్చి తేనెపోసి కలిపి లేహ్యాపాకంగా కలిపి యిచ్చిన గుణమిచ్చును. ఇందుకు పథ్యం ఆవునెయ్యి, సన్న బియ్యం, లేతవంకాయ,

## —: రసభస్మము :—

ఊడుగపట్ట తెచ్చి కొంచెం నీళ్లుచల్లి కొట్టి రసం తీసుకొనవలెను. రసం ౨౦ వరాలయెత్తు కల్వంలో వేసి ౧ ఝాముమూరవలెను. ఈ క్రమాన ౨౧ దినం నూరి దానిని బిళ్లచేసి యెండించి మూసలో బెట్టి చీలమన్నుచేసి మొలలోతున గుంటత్రవ్వి పుటంవేయవలెను. పుటంచాలక పోయిన నల్లగాపోవును, చాలిన అధిక ధావళ్యమౌను, ఆభస్మం లవంగాలు, కల్పి పూటకు సూకయెత్తు తేనెతో యిచ్చేది, సకలమైన వాయువులు, క్షయజ్వర దోషాలుమానును. ఇచ్ఛాపథ్యం ౭ దినాలు యిచ్చిన ధాతువృద్ధి కలుగును, పాలు, నెయ్యి, విశేషముగా కూర్చుకొనేది సకల రోగాలకు యియ్యవచ్చును.

## —: నల్లసీసభస్మము :—

నల్లసీసం ౩ పలం, పుల్లసిపెరుగులో ౫ మాట్లు కరిగించిపోసేది, ౧ మద్దిపట్ట తెచ్చి నీళ్లుపోసితొక్కి రసముగ్రహించి ఆనీళ్లలో మూడు మాట్లు కరిగించి పోసి కడ్డీగా కరుగ పోసికొని పొడిగా రాచుకొని, నేరేడు

పట్టనూరుకొని ఆపొడికి సరిగ్గా కూర్చి నూరి బిళ్లగాచేసి, నేరేడుపట్ట,ముద్ద పైని కవచంఇచ్చి మూరెడు పుటం వేసేది, భస్మమౌను. వింశతిమేహాలు కృఛ్రాలు మొదలైనరోగాలు మానును.

—: అమృత సంజీవనీరసము :—

రసం, గంధకం, తాళకం, మనశ్శిల, పగడం, ముత్యం, బంగారు రేకు, కటుకరోహిణి, సమాంశాలుగా కూర్చి. మేకపాలతో ౭ ఝాములు లెస్సగా నూరి బిళ్ల చేసి యెండించి పాలికలోవుంచి చీలమన్ను యిచ్చి ముక్కాలుమూర పుటంవేసేది. సాంగశీతలాన యెత్తి చూచిన సరిగా వుండును. సకల రోగాలకున్ను అనుపాన విశేషాలచేత యిచ్చేది. భూపతి కన్నా అధికమైనగుణం యిచ్చును.

............................

నాగం పలం ౧, రసం పలం ౧, ద్వంద్వించుకొని కల్వమునవేసి శుద్ధిచేసిన కఫరి పలం ౧, గంధకం ప ౪, కూడావేసి అర్కపత్రరసాన ౧౦ దినాలు నూరి బిళ్లచేసి యెండించి పాలికలోవుంచి చీలమన్నుచేసి కుక్కుటపుటంవేసేది. దానికిసగం రససింధూరంకూర్చి చిత్రమూలకషాయాన రెండుఝాములు నూరి మాత్రచేసి వుంచుకునేది అనుపానవిశేషాలచే యిచ్చేది, జ్వరము దోషాలు, నూతికావాయువులు, చెమటలుపట్టి అన్నితీరును. తెల్లపాషాణం, పాషాణం ప ౧ గడ్డతెచ్చి పడిసున్నపురాళ్లు దుత్తలో సగంవేసి పాషాణంగడ్డవుంచి పైన ఆసగంరాళ్లుపోసి తర్వాత వేడినీళ్లుపోసి దుత్తనిశా పోసి మూసిపెట్టేది. మర్నాడాగడ్డయెత్తి లెస్సగా కడిగి కల్వానవుంచి ౫ వరాయెత్తు వుమ్మెత్తవిత్తులున్ను ౨ వరా యెత్తు తెల్లజిల్లేడువేరు పట్టాను వేసి జిల్లేడుపాలతో ౨ ఝాములునూరి పచ్చపెసలంత మాత్రలు చేసి వుంచుకొని పూటకు ఒకమాత్ర త్రికటుతోయిచ్చినట్లయితే యేటువంటి శీతజ్వరాలు, చాతుర్థికాలు మానును. పథ్యం కోయికూర వంకాయ, కందికట్టు, మునగపిందెలు కూర్చేది. ఉప్పు శుద్ధిచేసి కూర్చేది.

—: తెండావాళ సింధూరము :—

తెండావాళం వ ౫ం, గంధకం వ ౧ం, రసం వ ౫, తెండావాళం కొలిమిలో వేసికాచి గోమూత్రాన వేసేది. ఇసుకవలె చేసుకొని ఆ పొడి కలబందరసాన కాటుకవలె నూరి బిళ్లగాకట్టి ప్రమిదలోవుంచి మరియొక ప్రమిదచేమూసి, శీలమన్నుయిచ్చి గజపుటంవేసేది. పుటాలు ౫ గంధకంవేసి అరపొడి మూడుపలాలు కూర్చి ఆరసాన నూరి మూడుపురాలువేసేది. గంధకంవేసి, పురాలు ౫. వరాయెత్తు, రసంవేసినూరి వొక పుటం గజపుటంవేసేది. సింధూరం తయారగును. ఇందుకు అనుపానం త్రికటుకం వోమం, జీలకఱ్ఱ, పొడిచేసి రూకయెత్తు తేనెతోయిచ్చినవీను బిళ్లలు, మహోదరాలు, ఆమగడ్డలు, రక్తగడ్డలు, శ్వాసకాసాలు, గుల్మాలు, హృద్రోగాలు, మానును, యిచ్ఛాపథ్యం.

—: తాళకభస్మము :—

తాళకం శుద్ధిచేసి పలుకులాగతీసి, వృత్తరేణి బూడిద ఒక కుండలో పడెడుపోసి ముద్దగా అదిమి, దానిపైని, విడాకువేసి అందులో తాళకంవేసి, దానిపైని తాళకం విడాకు మూసి దానిపైన యీ బూడిద పడిపోసి పొయ్యి మీద నుంచి మూడుఝాములు మంట వేసిన భస్మమౌను. బూడిదమీద పక్వసమయమందు ఇసుకవలె విచ్చును. అదిగమనించి తీసుకొనేది. బియ్యపుగింజంత యిచ్చేది. శ్వాసకాసాలు, క్షయములు, శోఫ, పాండువులు, మానును. పథ్యం జాగ్రత్తగా వుంచేది. ౭ దినాలుయిచ్చేది.

—: ఒడికగడ్డలకు :—

చిత్రమూలం పైపట్ట శేరు, నూగులు శేరు ౧, .........చిత్రమూలం చూర్ణంచేసి యిదికూడావేసి కలిపి కలిసే పర్యంతంకొట్టి పదను అయ్యేందుకు నూనెపోసి కలిపి నిత్యం నిమ్మకాయంత సాయంప్రాతః యేడుదినాలు తినిన వొడికగడ్డలు పగిలి పక్వమవును......అణిగిపోను యిచ్ఛాపథ్యం పొగాకువాడరాదు.

## —: రసభస్మము :—

రసం వరా ౮, జోడసరపాకు రసంతీసి ౮ ఝాములు నూరి వొక్క గజపుటంవేసిన భస్మమౌను. ఇందున మేహవాయువులు, మేహాలు, అశీతివాయువులు మానును యిచ్ఛాపథ్యం. రసంపలంర, పసుపుపొడి ప౩ కరిధూపం ప 3, యిటికపొడి వ ౩, మర్దించి ఝాముతర్వాత బట్టలో వేసి పిసికి బియ్యం నిమ్మపండురసంతో నానవేసి నూరేది. నల్లతులసి, ఆకురసం పట్టెడు వేసి నూరేది తమలపాకు ఒకటికూడ వేసి నిమ్మపండ్ల రసంపోసి ఝామునూరేది. తర్వాతమెత్తి గచ్చకాయంత వుండలుచేసి అన్నివుండలు తేనెలోవేసికలిపి యేడుదినాలు సాయంప్రాతః తినేది. యిందుకు అపథ్యం పొగాకు, వంకాయ, పెద్దగుమ్మిడికాయ, ఆవాలు తూ పిడి మరుపథ్యం ౭ దినాలు అయినతర్వాత స్నానం చేయించవలెను. స్త్రీ మైధునం నలభై దినాలు కారాదు. నిత్యం చన్నీళ్లస్నానం చేయించుము కళింబు. రసకర్పూరం వ ౩, నెయ్యి ర వరాయెత్తు ఝామునూరి చమురు కునేది. నోటిపుండెరపడిన కాచువక్కలు నల్లతుమ్మపట్టను కషాయంకాచి పుక్కిలించేది. గ్రంధి, వొడిశగడ్డలు మేహాలుమానును. ఇది సిద్ధక్రియ.

## —: సుముఖ వెండిభస్మము :—

వెండిభస్మం, తామ్రభస్మం, పగడభస్మం రసం గంధకం మనశ్శిల, హారిదళం, కటుకరోహిణి యివి సమాంశాలు కూర్చి మేకపాలునమర్దించి మూసలోబెట్టి వొకగజపుటం వేసేది సాంగ శీతలమున దించి మృదువుగా మర్దించి, రెండు వరిగింజలంత అనుపానములకు, యిచ్చిన వాత పిత్త శ్లేష్మజ్వరాలు మానును.

## —: కమలారసము :—

రసం, అభ్రకం, గంధకం, లోహభస్మం, తామ్రభస్మం, యివి సమాంశాలుకూర్చి, న్యా ......... లు రసాన రెండుదినాలుమర్దించి గుళికలుచేసి యెండించి, గా జు కు ప్పె లో బె ట్టి చీలమన్ను యిచ్చి వాలుకాయంత్రాన ఆరుఝాములు వండి సాంగశీతలాన దించి ఆరు

ఝాములు మర్దించి అనుపాన విశేషాలచేత యిచ్చిన దోషజ్వరాలు సన్నిపాతాలు మానును.

—: పితామహారసము :—

శుద్ధిచేసినరసం నాభి యింగిలీకం కటుకరోహిణి లోహభస్మం తామ్రభస్మం బియ్యపు పొడి హారిదళం యివి సమాంశాలు కూర్చి జిల్లేడువేళ్ల రసం కషాయాన మృదువుగా మర్దించి గుళికలుజేసి గాజు కుప్పెలోపోసి 2 చీలమన్నులుచేసి వాలుకాయంత్రాన మూడుఝామలువండి సాంగశీతలానదించి గురిగింజంత మాత్రచేసి అనుపాన విశేషములతో యిచ్చిన సన్నిపాతాలు మానును.

—: భారతీరసము :—

రసం, గంధకం, అభ్రకం, నాభి, సమాంశాలు కూర్చి జోడ సరపాకు రసాన వొకదినం మర్దించి గుంజామాత్రం అనుపాన విశేషాల యిచ్చిన జ్వరాలు మానును. త్రయోదశసన్నులు మానును.

—: సన్నికి విభూతి భైరవరసము :—

రసం, గంధకం, తామ్రభస్మం యిది సమాంశాలు కూర్చి చిత్రమూలకషాయమున మర్దించి వజ్రమూసలో బెట్టి వాలుకాయంత్రాన ఒకదినం వండి పిల్లిపిత్తాన మర్దించి గుంజామాత్రం వటకములు చేసి అనుపానవిశేషములతో యిచ్చిన సంధిసన్ని మానును.

—: తగరం సీసం శుద్ధి :—

నెయ్యితో యేడుమాట్లు కరిగించివావిలి స్వరసంలో పోశేది శుద్ధి అవును. అష్టలోహాలున్ను యీ క్రమాన శుద్ధిఅవును.

—: పంచలవణంశుద్ధి :—

సైంధవలవణం మేకపంచితాన వుడికించేది, సౌవర్చలవణం ఆవుపంచితాన నానబెట్టి యెండించిన శుద్ధిఅగును. నిమ్మపండ్లరసాన

యెండించిన శుద్ధిఅగును. కాచలవణం చింతాకు రసాన నానబెట్టి యెండించిన శుద్ధిఅగును.

—: హరితాళం —

మూకుడులోబెట్టి అది మునుగునట్లు చనుపాలుపోసి నాలుగు దినాలు వూరనిచ్చి సూర్యపుతానబెట్టి గుమ్మడికాయ రసములో డోలా యంత్రాన ఉడకబెట్టిన శుద్ధిఅగును.

—: మనశ్శిల :—

ఆవుపాలున్ను, మినప కట్టున్ను డోలాయంత్రాన పురం పెట్టిన మనశ్శిల శుద్ధిఅగును

—: వెల్లిపాషాణం గౌరిపాషాణం శుద్ధి :—

ఉమ్మెత్తకాయలో పాషాణంబెట్టి, ఉడకపెట్టి తరువాత కరక్కాయలో బెట్టి ఉడకబెట్టేది, ఆవుపంచితాన, ఆవుపాలను గుమ్మడికాయ నీళ్ళను ఒక్కొక్క వగను డోలాయంత్రాన వండను గౌరిపాషాణం, వెల్లి పాషాణం శుద్ధిఅగును.

—: మైలుతుత్తము కఫరి శుద్ధి :—

మైలుతుత్తం పొడిచేసి నిమ్మపండ్లరసాన నానబెట్టి సూర్యపుటాన బెట్టి యెండించను మైలతుత్తం శుద్ధిఅవును. కపరితుత్తం పొడిచేసి ఆవుపాలు నిమ్మకాయలరసాన సూర్యపుటానబెట్టి యెండించి, కుక్కుట పుతం 1 వేసిన శుద్ధిఅగును.

—: లవణ శుద్ధి :—

సముద్రలవణం వెచ్చగావేయించిన శుద్ధిఅగును. సర్జక్షారం కలితో మూడుఘడియలు మర్దించిన శుద్ధిఅగును

—: గంధక శుద్ధి :—

గంధకం పొడిచేసి కుండలో మజ్జిగపోసి, కుండకు వాశనుకట్టి

మీాద గంధకంపొడి పోసి మూకుడుచే మూసి చీలమన్ను చేసి ఒక పల్లములో పూడ్చి, పై పెంకు తెలికేటట్టు పైన కుక్కుటపుటం వేసిన శుద్ధి అగును.

—: యవక్షారము :—

పశికడుగున ? మర్దించి, ఘడియకాలము యెండించిన శుద్ధి.

—: యింగువ :—

తామరపు వుటాన ? బెట్టి యెండలో భావనచేసిన శుద్ధి.

—: కర్పూరశిలాజిత్తు :—

దొండాకురసానగాని, తామర తూండ్లరసానగాని ఝాము మర్దించిన శుద్ధి.

—: నల్లబోళము :—

ఎఱ్ఱబోళం కలియపోశి యెండింపను శుద్ధి.

—: గజపిప్పళ్లు :—

గోమూత్రాన ఝాముభావనచేసిన శుద్ధి. ఉమ్మెత్తవిత్తులు, నిమ్మపండ్లరసాన నానబెట్టిన శుద్ధి.

—: ముష్టిగింజలు :—

చిఱ్ఱివేళ్ళరసాన ఝాము పూరబెట్టిన శుద్ధి.

—: శొంఠి :—

సున్నంపూసిన శుద్ధి.

—: పిప్పళ్లు :—

చిత్రమూలంరసాన ఝాము యెండలో పెట్టిన శుద్ధి.

—: మిరియాలు :—

పులి చల్లలో నాన బెట్టి యెండించిన శుద్ధి.

—: సోమము :—

సున్నపునీళ్ళుపోసి ఝూము నానబెట్టి యెండించిన శుద్ధి. రెండు జీలకఱ్ఱలు ఝూము యెండించి వెచ్చచేసిన శుద్ధి.

—: ఇంగిలీకం :—

నిమ్మకాయనగాని, చనుబాలనుగాని మర్దించిన శుద్ధి, యిది పగులగొట్టి పాతగుడ్డను మూటగట్టి గోమూత్రం కలిపి, అరటిగడ్డనీళ్ళను యీ మూడింటిచే నాలుగేసి ఝూములు డోలాయంత్రాన శుద్ధి చేయవలెను.

—: గంధకశుద్ధి :—

ఆవుపాలునగాని, మేకపాలునగాని అటికలోపోసి వాశనకట్టి, దానిమీద గంధకంపెట్టి మీద మూకుడుమూసి చీలమన్ను యిచ్చి కుక్కుటపుతం పెట్టిన శుద్ధి.

—: తాళకశుద్ధి :—

తాళకం నిమ్మకాయరసాన మేకపాలను సున్నపునీళ్ళను యీ నాలుగు ప్రత్యేకాలుగా శుద్ధి అగును.

—: ఆనంద భైరవము :—

శ్లో. హింగుళం వత్సనాభం చ మరిచం టంకణం కణా ।
జంబీరరస మధ్యేతు మర్ద్యం యామ చతుష్టయమ్ ॥ 777

శ్వాసకాసాతిసారేషుష్యా జీర్ణే చాగ్నిమాంద్యకే ।
ఆత్ర రోగే ప్రమేహే చ సర్వవృశ్చిక దష్టకే ॥ 778

గుంజామాత్రం ప్రదాతవ్యం రసమానందభైరవమ్ । 779

టీ. ఇంగిలీకం శుద్ధనాభి మిరియాలు వెలిగారం పిప్పళ్లు యివి సమాంశం కూర్చి నిమ్మపండ్లరసాన నాలుగుఝాములు మర్దించి గుంజా మాత్రం గుళికలుజేసి నీడన యెండించి శొంఠి పిప్పలి మిరియాలు యివి అనుపానంబెట్టి వక గుళిక యిచ్చిన, జ్వరం, దగ్గు వుబ్బసం, అతిసారము మానును. అజీర్ణం అగ్నిమాంద్యములకు తమలపాకు రసాన గుళిక యిచ్చిన జ్వరం లోపలగల తలనొప్పి మానును. సర్ప వృశ్చిక విషములు తగ్గును.

## —: కరాట (?) గుణ :—

శ్లో. ఉత్తమం వేణునాళం చ మధ్యమం కరిదంత యోః।
నిమ్బంచతుమ్బం చక్రాంగే శీతతోయేన మర్దయేత్ । 780

గుంజామాత్రం వటీం కుర్యాత్ దేయమార్ద్రిక జెరసే।
గండభైరవ నామాయం తరుణజ్వర నాశనః ॥ 781

టీ. ఇంగిలీకం వ౧, నాభి వ౧, కటుకరోహిణి వ౧, చల్లనీళ్లచే మర్దించి గుంజామాత్రం గుళికలుజేసి నీడనుయెండించి, అల్లపురసాన వొక గుళిక యిచ్చిన తరుణజ్వరం మానును.

## —: అమృత సంజీవినిరసం :—

శ్లో, శుద్ధసూతం విషం గంధం హింగుళం కటురోహిణీ।
భృంగరాజస్య స్వరసేమర్ద యేద్దివసత్రయమ్ ॥ 782

మాషమాత్రం వటీంకుర్యాచ్చార్ద్రికస్యానుపానతః।
దేయమమృత సంజీవిరసోయం సన్నిపాతజిత్ ॥ 783

టీ. శుద్ధరసం, శుద్ధనాభి, శుద్ధగంధకం, యింగిలీకం కటుకరోహిణి వీనిని సమాంశాలుకూర్చి గుంటగలిజేరు ఆకురసాన మూడుదినాలుమర్దించి మినపగింజంత మాత్రచేసి నీడనయెండించి అల్లపురసాన వొకగుళిక యిచ్చిన తరుణజ్వరం మానును. సన్నిపాతాలు మానును.

—: బాల జ్వరాంకుశము :—

శ్లో. త్రికటుకంకటుకాచైవ పాఠామూలం హరీతకీ।
ఉష్ణతోయే వటీం కుర్యాత్ బాలానాం జ్వరనాశనమ్॥ 784

టీ. శొంఠి, పిప్పలి, మిరియాలు, కటుకరోహిణి, పాఠమూలం, కరక్కాయ, సమంప్రత్యేకం చూర్ణంచేసి వేడినీళ్లతోనూరి, గురిగింజలంతమాత్రంచేసి చంటిబిడ్డలకు వేడినీళ్ళను వొకగుళియిచ్చిన,మూడు దినాలులోగ జ్వరంవిడుచును.

—: ఔషధ పథ్యము :—

శ్లో. క్వాథస్యకల్కస్వరసస్యయామంమాసత్రయంచాంజనవస్తిచూర్ణమ్।
షణ్మాసకంలేహ్యావటీచవీర్యం సంవత్సరంతైలఘృతం నసత్వమ్। 785

—: పాదరసం శుద్ధి :—

ఊడుగాకువేళ్లున్ను, కేలఆకు వేళ్లున్ను, కలబందరసమున్ను వగకు సమం కషాయంకాచి పాదరసంతోను, బోసిగుమ్మిడికాయ రసాన పాషాణం, పాతగుడ్డనుమూటగట్టి డోలాయంత్రమున వండిన పాషాణం శుద్ధి అగును,

కాంతముగాని, వుక్కుగాని, యినుముగాని శుద్ధిచేసి పొడిచేసి గోమూత్రానకలిపి జిల్లేడుపాలను వులవకట్టు వ గటికి యేడుమాట్లు కాచి అద్దవలెను,

—: పాషాణశుద్ధి :—

ఉమ్మెత్తాకు, జిల్లేడుఆకు, గురిగింజ మూడు వగలున్ను మజ్జిగతో తొక్కి కలిపి గరిటలో నూనె పోసి, తగరం ఎలిక పాషాణపాతగుడ్డను మూటగట్టి సున్నమునీళ్లలో డోలాయంత్రాన వొకదినం వుంచిన శుద్ధి.

—: కాంతము :—

నిమ్మకాయరసాన, కలిని, పులిచల్లను యీమూటిను రెండు ఘడియలు నానబెట్టిన కాంతశుద్ధి. శుద్ధిచేసిన కాంతమునకు నాలుగో పాలు గంధకంబెట్టి జిల్లేడిపాలను గొర్తెపెంటికరసాన, మోదుగ చెక్క రసాన యీమూటిని ప్రత్యేకముగా మర్దించి వొక్కొక్క పుటంలెఖ్ఖను మూడుపుటాలు (గజపుటం) పెట్టిన కాంతము భస్మమగును. ఆ భస్మములో సగము యింగిలీకంబెట్టి, దూలదామర రసాన మూడుదినాలు మర్దించి యెఱ్ఱమంటను మూసబెట్టి అందులో మర్దించిన కాంతంబెట్టి చీలమన్నుచేసి మూడుగజ పుటాలుబెట్టిన సింధూరం తయారగును.

—: తగరము :—

ఉత్తరేణాకురసావ వేయింపనిచ్చి భస్మం నిమ్మపండ్లరసాన మర్దించి మూడుగజపుటాలువేసిన సింధూరం అగును.

—: తాళకశుద్ధి :—

తాళకం, గుమ్మడికాయరసాన, మేకపాలున సున్నపునీళ్లన, యీ నాలుగు దాయాలున్ను ప్రత్యేకాలుగా వండిన తాళకం శుద్ధి అగును.

—: లోహశుద్ధి :—

లోహం రాగిపాడి నూనెలోవోసి వుడకబెట్టినవెనుక, నీళ్లతో కడిగి, తుమ్మచెక్కరసాన తిరుగావండి యెండించి, ఘూము మర్దించిన లోహం శుద్ధి.

ఆ శుద్ధిచేసిన రాపాడి మెత్తగా చూర్ణం చేసి రొంగుచక్క రసాన రెండుఝాములువండి, వుశిరికపప్పు రసాన, చింతాకు రసాన, మునగచక్క రసాన, ఆవుపంచితాన, ప్రత్యేకాలుగావండి, ఆ పొడిని మర్దించి అది మూసలోబెట్టి, గజపుటం వేసిన, లోహంభస్మమాను, కర

క్కాయ, కాడికాయ, ఉశిరికపప్పురసాన ముష్టిపాలు, జిల్లేడుపాలున యేడుదినాలుమర్దించి మూసలోపెట్టి, యేడుగజపుటములుబెట్టిన ఆ లోహం సిందూరమౌను.

—: తాళకశుద్ధి :—

శ్లో. అథతాళకశుద్ధిశ్చ వక్ష్యతే భిషగుత్తమ !
తాళం సూక్ష్మదళంకృత్వా వస్త్రే బధ్వా చ బుద్ధిమాన్ ॥ 786
గోమూత్రేకాంజి కేవాపి డోలాయంత్రే దిన త్రయమ్ ।
పాచయేన్మధ్యమాగ్నౌ తు శుద్ధిర్భవతి తాళకమ్ । 787

—: మనశ్శిలా శుద్ధి :—

శ్లో. సూక్ష్మవస్త్రద్వయోపేతం మనోగుప్తానుబంధనమ్ ।
పాచయేన్మేషమూత్రేణ డోలాయంత్రే దినత్రయమ్ ॥ 788
తేన శుద్ధిం సమాప్నోతి కునటీ నాత్ర సంశయః ।

—: కర్పూర శుద్ధి :—

శ్లో. కర్పూరం పలమాత్రం తు చూర్ణంకృత్వా తు బుద్ధిమాన్ ।
నరమూత్రే సప్త యామం డోలాయంత్రే పచేత్తథా ॥ 789
గవాం మూత్రే ద్వియామం చ పాచితం శుద్ధిమాప్నుయాత్ ।

—: విమల శుద్ధి :—

శ్లో. సంచూర్ణ్య విమలాం ధీమాన్బ ధ్వాసూక్ష్మాంశుకేనతామ్ ।
అజామూత్రే కాంజికేన రంభాతోయే పృథక్ పృథక్ ॥ 790
డోలాయంత్రే చతుర్యామం పాచయేచ్ఛుద్ధిమాప్నుయాత్ ।

—: మాక్షిక శుద్ధి :—

శ్లో. మాక్షికం ఫలమాత్రం చ మధునా సహమర్దయేత్ ।
కుళుత్థయూషే గోమూత్రే కాంజికే దివసత్రయమ్ ॥ 791
పాచనాద్డోలికా యంత్రే శుద్ధిర్భవతి నిశ్చయమ్ ।

—: ఉల్లిపాషాణ శుద్ధి :—

శ్లో. ఉల్లిపాషాణశుద్ధ్యర్థం శిలాహారోదకేన చ । 792
డోలాయంత్రే దినైకం తు పాచన్ త్తేన శుధ్యతి ।

—: గౌరీపాషాణ శుద్ధి :—

శ్లో. ద్విదినం పయసా గౌరీ మర్దితా శుద్ధిమాప్నుయాత్ ।
జంబీర స్వరసే నాపి మర్దనాచ్ఛుద్ధిమాప్నుయాత్ । 793

—: వెలిగార శుద్ధి :—

శ్లో. టంకణం భర్జయేదగ్నౌ మర్దయేత్ కాంజికేఽథవా ।
జంబీర స్వరసేనాపి మర్దనాచ్ఛుద్ధి మాప్నుయాత్ ॥ 794

—: మైలతుత్థం శుద్ధి :—

శ్లో. మయూరతుత్థం స మ్మర్ద్యం పవనా సహ మోజకమ్ । ?
లోష్టర రక్త శ్వతంచోధం ? శుద్ధిర్భవతి నిశ్చయమ్ ॥ 795

—: పాలతుత్థం శుద్ధి :—

శ్లో. ఫలమాత్రం క్షీరతుత్థం చూర్ణీకృత్య చ బుద్ధిమాన్ ।
పటే బధ్వాచ తచ్చూర్ణం శుద్ధ్యర్థం సలిలే పచేత్ । 796

—: గంధక శుద్ధి :—

శ్లో. గంధకం పలమాత్రం తు లోహపాత్రే వినిక్షిపేత్ ।
ఏరండతైల సంయుక్తం పచేచ్ఛుధ్యర్థమేవ తత్ ॥ 797
అథవా భాగదుగ్ధేన పాచనాచ్ఛుద్ధి మాప్నుయాత్ ।

—: నేపాళ శుద్ధి :—

శ్లో. నిస్త్వచం చైవ నేపాళం కుమారీరసకేన చ ।
గుడోదకేన గోక్షీరైః గోఘృతేన పృథక్ పృథక్ ॥ 798
పాచితం శుద్ధి మాప్నోతి వైద్య శాస్త్ర వినిశ్చితమ్ । 799

—: వత్సనాభి శుద్ధి :—

శ్లో. విషం గోమూత్ర సంయుక్తం భాగ మాత్రేణ వాऽథవా।
స్థాపయేదాతపే భావ్యం త్రిదినాచ్ఛుద్ధి మృచ్ఛతి ॥ 800

—: సైంధవలవణం శుద్ధి :—

శ్లో. సైంధవం కాంజికే భావ్యం భవేచ్ఛుద్ధి ర్ఘటీద్వయే ।
అథవాభాగమాత్రేణపాచితం శుద్ధి మాప్నుయాత్ । 801

—: సౌవర్చలవణ శుద్ధి :—

శ్లో. సౌవర్చలం తు గోమూత్రే భావయేదాతపే సుధీః ।
నింబనీరేణ సౌవర్చం భావనాచ్ఛుద్ధి మాప్నుయాత్ ॥ 802

—: బిడాలవణ శుద్ధి :—

శ్లో. బిడా లవణకం తక్రే భావయేచ్ఛుద్ధిమాప్నుయాత్ ।
గోమూత్రేణాऽథవా భావ్యం శుద్ధిర్భవతి నిశ్చయమ్ ॥ 803

—: కాచలవణము :—

శ్లో. లవణం కాచకం జ్ఞేయం తింత్రిణీ ఫలజద్రవైః ।
ఆతపే ద్విఘటీమాత్రం భావనాచ్ఛుద్ధిమాప్నుయాత్ ॥ 804

—: సముద్ర లవణ శుద్ధి :—

శ్లో. సముద్రలవణం లోష్టే తప్తంకుర్యాద్ద్వియామకమ్ ।
సమ్యక్ఛుద్ధం భవేద్వైద్యస్త్వౌషధేషు ప్రయోజయేత్ ॥ 805

—: సర్జక్షారము :—

శ్లో. సర్జక్షారం కాంజికేన మర్దయేద్ఘటికా ద్వయమ్ ।
అథవా భాగమాత్రేణ శుద్ధిర్భవతి నిశ్చయమ్ ॥ 806

—: యవక్షారము :—

శ్లో. యవక్షారం విమద్యాథ తండులోదక మిశ్రితమ్ ।
ఆతపే ఘటికా మాత్రం శోషేచ్ఛుద్ధిర్భవిష్యతి ॥ 807

—: శిలాజిత్తు :—

శ్లో. శిలాజిత్పలమాత్రంతు మర్ద్యంచోత్పల జైరసైః ।
ఆతపే ఘటికాస్సప్త శోషణాచ్ఛుద్ధి మాప్నుయాత్ ॥ 808

—: కర్పూరశిలా జిత్తుశుద్ధి :—

శ్లో. కర్పూరశిలధాతుశ్చ మృణాల రసమర్దితః ।
అథవోత్పలజైర్యామం సమ్యక్ఛుద్ధిర్భవిష్యతి ॥ 809

—: నల్లబోళము :—

శ్లో. పలమాత్రంకృష్ణ బోళం రక్తంవా మర్దితం చ తత్ :
ఆతపే కాంజికే యామం భావ్యం శుద్ధిర్భవిష్యతి ॥ 810

—: ఇంగువశుద్ధి :—

శ్లో. పద్మపత్రరసే యామమాతపే భావితంవిదుః ।
రామఠం శుద్ధిమాప్నోతి రసయోగేషు యోజయేత్ ॥ 811

—: గజపిప్పలిశుద్ధి :—

శ్లో. కాంజికే భావితా యామంశుధ్యేచ్చగజపిప్పలీ ।
అజామూత్రేణ వా భావ్యా శుద్ధిర్భవతినిశ్చయమ్ ॥ 812

—: ఉమ్మెత్తవిత్తులుశుద్ధి :—

శ్లో. జంబీర ఫలజ ద్రావైః భావితం యామమాత్రకం ।
ధూర్తబీజం భవేచ్ఛుద్ధం రసయోగేషు యోజయేత్ ।

—: ముష్టిగింజ శుద్ధి :—

శ్లో. బీజాని విషముష్టేశ్చ ఛిల్లికా మూలజై ర్రసైః ।
పాచనాత్త్రిఘటీమాత్రం విశుద్ధానిభవంతిహి ॥ 814

—: మిరియాలు :—

శ్లో. మరిచం చాఽపిత్రక్రేణ భావితం ఘటికాత్రయమ్ ।
లోష్టేత ప్తీకృతం సమ్యజ్మరిచం శుద్ధిమాప్నుయాత్ ॥ 815

—: ఓమశుద్ధి :—

శ్లో. అజమోద శిలాక్షారజలే భావ్యం విశోధనే ॥ 816

—: జ్వరధూపము :—

శ్లో. అరణ్యతులసీ బిల్వం కాకజంఘా కుశం నిశా ।
ఖరవిట్ కాకపక్షంచ ధూపనం జ్వరనాశనమ్ ॥ 817

టీ. కుక్కతులసి, మారేడుపత్రి, వెలుమసంధి, దర్భ, పసుపు, గాడిదపెంటికలు, కాకిరెక్కలు, వీనిచేధూపంపెట్టిన జ్వరాలు మానును.

—: సన్నిపాతధూపము :—

శ్లో. సర్పనిర్మోక శాండిల్య బర్హిర్లశున దీప్యకమ్ ।
మయూరపక్షం తులసీ ఖరవిట్ గుగ్గులుస్తథా ॥ 818
ధూపోయం సన్నిపాతఘ్నః నాగార్జున వినిర్మితః ।

టీ. పాముకుబుసము, మారేడుపత్రి, దర్భ, వెల్లుల్లిపొట్టు, వోమం నెమలియీకలు, ఎండిన తులసిఆకు గాడిదె పెంటికలు గుగ్గిలం, వీటి పొగ సన్నిపాతములందు శ్రేష్ఠము.

—: అశ్వగంధాదిచూర్ణము :—

అశ్వగంధాపలం ౫, శొంఠి ప ౨, పిప్పలి ప ౧, మిరియాలు ప ౧, జీరకం, యేల లవంగపత్రి, సన్నలవంగపట్ట, సెరునాగపూవు, శిఖ

